(1)

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయి
పూని ఏదైనాను నొక మేల్
కూర్చి జనులకు చూపవోయి
- గురజాడ అప్పారావు



21.09.1862 - 30.11.1915

## తెలుగు భాషా సాహిత్య వికాసానికి కృషిచేస్తున్న సాహిత్య ప్రస్థానం కు అభినందనలతో....

- జి. విద్యాసాగర్
అధ్యక్షులు
అఖిల భారత న్యాయవాదుల సంఘం (AILU)
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ

ఇం.నెం. 1-8-475, వెంకటేశ్వర టెంపుల్ వీధి, చిక్కడపల్లి, హైదరాబాద్ - 500 020
Ph: 040-27665352, Fax: 040-27636673, Cell: 98486 02522, e-mail: g_sagar02@yahoo.com

PRSVMORA153

సాహిత్య
ప్రస్థానం
సెప్టెంబర్ 2013
సంపుటి : 12 సంచిక : 9

# పరీక్షా సమయం

ప్రత్యేక తెలంగాణా కోసం ఉద్యమం, వివిధ రాజకీయ పక్షాల విన్యాసాల నేపథ్యంలో ప్రజల మధ్య సత్సంబంధాల పరిరక్షణ కీలకమని ప్రస్థానం పలుసార్లు విజ్ఞప్తి చేస్తూ వచ్చింది. గత సంచిక అచ్చు కాబోతుండగా ఆంధ్రప్రదేశ్ విభజన దిశగా నిర్ణయం తీసుకోబోతున్న సూచనలు కనిపించాయి. అందుకే ఆ సంపాదకీయంలోనూ మేము సంయమనం ఆవశ్యకతను నొక్కి చెప్పాము. జూలై 31న కాంగ్రెస్ అధిష్టానం పాలక యుపిఎ కూటమిల తరపున ఆ మేరకు ప్రకటన వచ్చింది. అయితే తెలంగాణా రాష్ట్ర ప్రక్రియ మొదలు పెడతామన్న కేంద్రం ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీ అందుకు సంబంధించిన వివరాలు, కోస్తా రాయలసీమ ప్రాంతాలలో తలెత్తే సమస్యలు సందేహాలపై ఇంకా ఎలాటి స్పష్టత ఇవ్వలేదు. విభజనకు అనుకూలమన్న రాజకీయ పక్షాలకు చెందిన వారే సమైక్యత అంటూ ఆందోళనలు చేయడం ఒకవైపు, విభజన కోరిన వారి నుంచి వివాదాస్పద వ్యాఖ్యలు మరోవైపు వాతావరణం దిగజారడానికి కారణమవుతున్నాయి. ఇది ఎంత మాత్రం వాంఛనీయం కాదు. అన్ని పార్టీలూ అన్ని ప్రాంతాల్లో ఒకే మాట చెప్పి సహేతుక పరిష్కారం కోసం సహకరించాలి. ప్రాంతాల మధ్య వైషమ్యాలు పెరక్కుండా అన్ని విధాల జాగ్రత్త వహించాలి. ఈ ఘట్టంలో ఇటూ అటూ కూడా రచయితలూ, కళాకారులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పెద్ద పాత్రే పోషిస్తున్నారు. ఆలోచనా పరులుగా ప్రశాంతతను కాపాడ్డంలోనూ వ్యర్థవివాదాలను ఉద్రేకాలను నివారించడంలోనూ వారు ముందుండాలి. అప్పుడే ప్రజాస్వామికంగా సమస్యలు పరిష్కరించుకోవడం సాధ్యమవుతుంది. అందుకు భిన్నంగా ఎలాటి సంకుచిత వాదనలకూ స్వార్థపర వ్యూహాలకు లోనైనా తెలుగు ప్రజలందరికీ నష్టం కలుగుతుంది. పెనుగాలి వీచింది/ పడవాగిపోయింది/ నట్టనడి సంద్రాన నావ నిలుచున్నాది/ చుక్కాని పట్టరా తెలుగోడా/ నావ దరి చేర్చరా మొనగాడా అన్న చరణాలు ఇప్పుడు తెలుగు వారందరికీ వర్తిస్తాయి.

బొమ్మలు : టి. శివాజి, జె. వెంకటేష్, వి. రమేష్, జి. సోము

## ఈ సంచికలో...



సంపాదకవర్గం

తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వీరప్రసాద్
వల్లభాపురం జనార్ధన

కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టీసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# సైన్సు మహాప్రస్థానం

- వల్లభాపురం జనార్ధన
9440163687

సైన్సు ప్రపంచం
సైన్సు ప్రపంచం
సైన్సు ప్రపంచం పిలుస్తున్నది
బిరాన దానీ
వెలుగులు చూడగ
రండీ రండీ రారండి
నిజం కనుటకై
ధ్వజం ఎత్తుతూ
ఎదపరదాలను తొలగిస్తూ
రండీ రండీ
వినపడలేదా
సైన్సు ప్రపంచపు తూర్యారావం
మూఢ నమ్మకపు తూటా కుదురులు
హననం చేస్తూ ముందుకు రండీ
గారడి ఊహల
గాథలు విడిచీ
అజ్ఞాన కందకం దాటండి
బానిస చాకిరి బిడారు గోడల
అధికారాలా కూల్చండి
బిరాన దానీ
వెలుగులు చూడగ
రండీ రండీ రారండి
మతములనీయల
మాయల నమ్మే
మందుల్లారా చావండి
తెలివి కిరీటం
వెలుగు కోరే



వివేకులారా రారండి
ప్రయోగనేత్రము
తెరువుడు చూడుడు
యోచనదారిని నడవండి
సైన్సు ప్రపంచం
సైన్సు ప్రపంచం
ధాత్రికి వెలుగై నిండింది
రండీ ముందుకు
రండీ దూసుకు
భావ వాదమును గిల్లేయండి
ప్రభాత రవి కిరణాలైలెండి
గతి తార్కికమను గొడ్డండ్లెత్తి
పటపట పటపట పడగొట్టేస్తూ

రండీ
రండీ
రండీ ముందుకు
కనపడలేదా సైన్సు ప్రపంచపు
సత్యజ్వాలామేధాగ్ని
దుమికి దుమికి చుట్టుకొంటున్నవి
మూఢాచారపు రోగాలు
పిడిచిపిడిచి తిమిర జ్ఞానాల్
మనమేధస్సును చంపేస్తాయీ
మలినము కడిగే మందాకాదది
మూఢభావ కాంతారం
కరవాలాలై
శలాకమ్ములై
నరికేస్తూ కదలండీ ముందుకు
బిరాన దానీ
వెలుగులు చూడక
సైన్సు ప్రపంచపు జ్ఞాననగారా
వేకువతెస్తూ మ్రోగింది
జ్ఞానులవలెనూ
సౌమ్యుల వలెనూ
వివేకశరులై సాగండి
కనపడలేదా సైన్సు ప్రపంచపు
హేతువాదముల మిలమిలలు
గతి తార్కికముల ధుమధుమలు
విజ్ఞాన జ్వాలల భుగభుగలు

---

# ఆమె

- వి.వి. రాణి

**ఆనాడు** నిండు సభలో ఒకడు
ద్రౌపది చీర లాగి అవమానించడం
ఎంత నిజమో........
**ఈనాడు** దుర్మార్గులు నిర్భయను
చిత్రహింసలు పెడుతూ..
పైశాచిక ఆనందం పొందుతూ..
చంపేయడం అంతే నిజం
**ఆనాడు** తన మాట కోసం
కట్టుకున్న భార్యను
పరాయి వాళ్ళకు అమ్మేయడం
ఎంత నిజమో...
**ఈనాడు** కొందరు పురుష పుంగవులు
తన భార్య కష్టపడి పనిచేస్తుంటే...
ఆడబ్బు జేబులో వేసుకుని జల్సా చేయడం అంతే నిజం



ఆనాడైనా... ఈనాడైనా.. ఏనాడైనా...
అది ఇల్లే అయినా...
లేక ఆఫీసు అయినా..
పాలించే పాలకులు ఎవరైనా..
శారీరకంగా.. మానసికంగా..
కనపడే కష్టాలు కొన్నైతే..
కనపడని వేదనలు
ఎన్నో.. ఎన్నెన్నో ....
మనకు తెలిసిన గాథలు
కొన్నే.... కావచ్చు
వెలుగులోకి రాని నిర్భయలు ఎందరో...
తెలుసా... మీకు !

కథ



# జన్మభూమి

- డా॥ ప్రసాదమూర్తి
8498004488

**అమ్మనీ నాన్ననీ చూద్దామని ఊరెళ్ళాను. నేనొచ్చానని ఆనందం వారి కళ్ళల్లో, తీసుకుపోతాడేమో అని బూచాడిని చూసిన పిల్లల్లా గుబులు వారి గుండెల్లో ఒకేసారి చూశాను. నాన్న తన మోకాలు చూపించి అటూ ఇటూ ఊగించి ఇప్పుడు బాగుందని కూర్చుని లేచి మరీ నవ్వాడు. అమ్మ తన చేయి చూపించి అతుక్కుపోయింది  నానా  అంటూ అటూ ఇటూ తిప్పి నన్ను నమ్మించడానికి తెగతిప్పలుపడింది. ఒంటరిగా ఉన్నా ఆరోగ్యంగానే ఉన్నారన్న సంతోషం ఎప్పుడూ ఒక విచారాన్ని వెంటబెట్టుకుని నన్నంటిపెట్టుకుని ఉంటుంది. ఆరోగ్యంగానే ఉన్నామన్న ధీమాతో హుషారులో వాళ్ళు అప్పడప్పుడూ కాలో చెయ్యో విరగ్గొట్టుకుంటూ ఉంటారు. అప్పుడే సమస్య అంతా. వాళ్ళు నాతో రారు.  నేను వాళ్ళతో ఉండలేను. డబ్బెంత పంపినా... మనుషుల్ని పెట్టినా ఇదో తెగని ఇనపతీగ సమస్య. నేను అలా వారిని చూస్తూనే ఇల్లంతా కలయతిరిగాను. అమ్మ నా కళ్ళల్లో ఏదో వెదుకుతుంది. నాన్న నా కదలికల్లో ఏదో వెదుకుతాడు. నేను ఇల్లంతా తిరుగుతున్నట్టే వారి చుట్టూ తిరుగుతూ నా ఆరాలేవో నేను తీస్తాను. అమ్మ కళ్ళల్లో,  నాబాల్యపు ఆకాశాలు కనిపిస్తాయి. నా కళ్ళల్లో అమ్మ తన యవ్వన కాలపు బొమ్మల్ని చూస్తుంది.**

నా కూడా మా ఊరు చూద్దామని నాతో హైదరాబాద్ నుంచి వచ్చిన మిత్రుడు రమేష్ లోపలేమనుకుంటున్నాడో కాని అంతా మౌనంగా చూస్తున్నాడు. వాడు ఆర్టిస్ట్. నేను జర్నలిస్టు. ఇద్దరం ఒకే కంపెనీలో పనిచేస్తున్నాం. సికింద్రాబాద్‌లో జన్మభూమి ట్రైన్ పట్టుకొని తాడేపల్లిగూడెంలో దిగి మాఊరు చేరుకునే సరికి సాయంత్రమైంది. ఊరంతా చీకటి. ఊళ్ళో చీకటి ఇంట్లో కూడా తిష్ట వేసింది. పరిచయాలయ్యాయి. ఎప్పుడో కొనిచ్చిన ఛార్జింగ్ లైటు బాగానే పనిచేస్తున్నట్టుంది. అది పట్టుకొని మా అమ్మ కూడా ఒకటే తిరుగుడు. నాన్న హాల్లో కూర్చుని ఒంటరిగా గోడతో ఏదో మాట్లాడుతున్నట్టుగా ఫోజు పెట్టాడు. రమేష్ ఎప్పుడూ ఆట పట్టిస్తూ ఆంధ్రా దొంగా అని ముద్దుగా పిలుస్తుంటాడు. మేమెక్కిన రైలు తెలంగాణా బోర్డర్ దాటగానే సమయం కోసం ఎదురుచూస్తున్న వాడిలా పచ్చని పొలాలను చూసి ఇక ఒకటే లంకించుకున్నాడు. ప్రపంచంలో పచ్చదనమంతా మీ దగ్గరే పెట్టుకున్నారు కదరా దొంగల్లారా అని దారి పొడువునా తెగ తిట్లు. ఇదంతా మమ్మల్ని దోచుకున్నదే కదా అని ఒకటే శాపనార్థాలు. పక్కనున్న ఆంధ్రావాళ్ళు వింటే వాడితో తగాదా పడతారని నా భయం. కాని అలా ఏమీ జరగలేదు. వాడు నన్నే ఉడికిస్తూ... ఉడికిపోతూ.. రైలు బండిలా దారిపొడవునా మోతే మోత. వాడి మాటలు నాకు అలవాటే కదా నేను నవ్వుతూనే ఉన్నాను. ఎప్పుడూ మా ఇంటికి రాలేదని

ఒకసారి కొల్లేరు ట్రిప్ వేద్దామని వచ్చాం. మా ఇంటికి రాగానే దారిలో కానిచ్చిన నసుగుడంతా మర్చిపోయాడు. మా అమ్మానాన్న కూడా నేను, నా వాళ్ళు, మా రమేష్.. ఇలా అలిసిపోయే దాకా అటూ ఇటూ ఆ మాటలు ఈ మాటలు చెప్పుకుంటూ ఇల్లంతా తిరిగాం. ఇంట్లో ప్రతిగోడ మీద నా బాల్యం నీడల్ని తడిమి తడిమి మరీ మరీ చూసుకున్నాను. ఏమిటీ తిరుగుడు. అనుకున్నాడో ఏమో ఒక్కసారిగా కుర్చీలో కూర్చుని" "అమ్మా కరెంటు ఎప్పుడొస్తుంది" అని అడిగాడు రమేష్. అమ్మకి ఏం చెప్పాలో తెలియక "ఏమయ్యా.. కరెంటంట ఎప్పుడొస్తాది?" అని నాన్న వైపు మా మిత్రుడి ప్రశ్నను ఫార్వర్డ్ చేసింది అమ్మ. ఆ... అంటూ సాగదీస్తూ నాన్న ఓసారి ఫోనందుకో అన్నాడు. ఎందుకో అని అమ్మ నవ్వుతూ అడిగింది. "చీఫ్ మినిస్టర్ని అడిగి చెప్తాను" నాన్న వేసిన ఈ జోక్‌తో చెలికాడు రమేష్ ఒకటే పగలబడి నవ్వాడు. ఏంట్రా సంపదంతా మీ దగ్గరే పెట్టుకుని మీకెందుకిన్ని కష్టాలు? అమాయకంగా అడిగాడు రమేష్. పగటికీ రాత్రికీ తేడా ఏంటో జనానికి తెలియజెప్పాలన్న తాపత్రయంలో మన నాయకులు ఇలాంటి ఘనకార్యాలు చేస్తున్నారు. ఇందులో మాత్రం ప్రాంతీయభేదం లేదురా బాబూ.



అదోలా చూశాడు వాడు. ఇంతలో అమ్మ అందుకుంది. "కరెంటు మాట మర్చిపోయాం నాయనా. అది వచ్చినప్పుడు దాని అవసరం ఉండదు. అవసరం ఉన్నప్పుడు అదుండదు". 'దొంగలకు కూడా కష్టాలు తప్పవన్నమాట'. చెవిలో గొణిగాడు రమేష్. ఇంతలో నాన్న బాత్‌రూమ్‌లో నీళ్ళు పెట్టాడు. డెబ్భయ్యేళ్ళు వచ్చినా తానింకా మిస్టర్ పెర్ఫెక్ట్ అని నిరూపించుకోవడానికి నాన్న ఒకటే ప్రదర్శన పెడతాడు. నేను వచ్చినప్పుడల్లా ఇది తప్పదు. అమ్మ కూడా చెంగు చెంగున తిరుగుతూ క్షణాల్లో వంట చేసి పడేసింది. ఎవరూ లేక ఇల్లు బోసిపోయినా వారు మాత్రం కళకళలాడుతూ అప్పుడే పెళ్ళయిన కొత్త జంటలా ఉత్సాహంగా కనిపించారు మా వాడికి. నేను కూడా వీళ్ళెప్పటికీ ఇంతే ఆరోగ్యంగా ఉంటే ఎంత బావుండు అని ఆశపడతూ ఉంటాను. అమ్మా నాన్న కళ్ళ చుట్టూ కాళ్ళ చుట్టూ వారి కలల చుట్టూ ఒరుసుకుంటూ ప్రవహించిన నా బాల్యం తలపులు ఇక్కడికొచ్చినప్పుడల్లా నన్ను చుట్టుముడతాయి. వారు కూడా నాతో పాటే వస్తే అమ్మా నాన్న పిల్లలై నాచుట్టూ తిరిగితే ఎంత బావుండు అనుకుంటాను. కాని వారికి పోటీ వచ్చేవారు నా చుట్టూ చాలా మందే ఉన్నారన్న స్పృహ నాకంటే వీళ్ళకే ఎక్కువ. అందుకే రారు. "అదృష్టంరా మీ అమ్మా నాన్నా ఆరోగ్యంగా ఉన్నారు." రమేష్ నార్మల్ గానే అన్నాడు. "అంత లేదు. నేనెక్కడ నాతో తీసుకుపోతానో అని వారి హంగామా అంతే. నాకు పంచిచ్చిన రక్తం కంటే నాతో పంచుకున్న రక్తం మీద వారికినమ్మకం లేదు."

రాత్రి భోజనాల దగ్గర అమ్మ కొసరి కొసరి వడ్డించింది. అమ్మలంతా ఒకటే. నేను రమేష్ వాళ్ళ ఊరు వెళ్ళినప్పుడు రమేష్ అమ్మ చేసిన హడావుడి.. చూపిన ప్రేమ మర్చిపోలేను. అమ్మ ప్రేమ తట్టుకోలేక పోతున్నాడు రమేష్. కొంచెం ఇబ్బందిగానే ఉన్నా చాలా త్వరగా వాళ్ళమ్మకీ మా అమ్మకీ తేడా మర్చిపోయి చనువుగానే మెలగడం మొదలుపెట్టాడు. ఆ చనువుతోనే ఏవేవో అడగడం స్టార్ట్ చేశాడు. అమ్మ, నాన్నా అంతే చనువుగా జవాబులు చెప్తున్నారు. "మీరు హాయిగా మాతోనే హైదరాబాద్‌లో ఉండొచ్చుగా అమ్మా. ఇక్కడెందుకు ఇంత ఒంటరిగా ఈ లంకంత కొంపలో" అడగరాని క్వశ్చన్ అడిగేశాడు. అంతే అమ్మా నాన్నా బిగుసుకుపోయారు. మాటల్లేవు. మాట్లాడుకోవడాల్లేవు. అన్నట్టు పెద్దోడు పచ్చడి తీసుకు వెళతాడు. ఆ జాడీ తీసి కింద పెడతారా? ఎక్కడో అటకమీద పెడతారు. ఈయనగారి పచ్చడి కోసమే దొంగలొస్తారు కాబోలు!" టాపిక్ డైవర్ట్ చేయడానికి అమ్మ ప్రయత్నం. 'అవును కదా... తీస్తానుండు!' అని నాన్న అక్కడ నుండి లేచాడు. అమ్మ కూడా ఆయన్ని అనుసరించింది.

వాడికర్థంకాక నా మొహం చూశాడు. ఏ తల్లిదండ్రులూ రారు. ఉన్న ఊరినీ, పిల్లల్ని కనీ పెంచి పెద్ద చేసిన ఇంటినీ వదిలి అస్సలు రారు. పక్కనున్న పుల్లమ్మో ఎల్లమ్మో వారికి కొడుకుల కంటె కూతుళ్ళ కంటే దగ్గరవుతారు. వాళ్ళే సమస్తం చూసుకుంటారు. వాళ్ళు రాలేరు. బలవంతంగా తీసుకు వెళ్ళినా పోలీసులు ఎత్తుకుపోతున్న ఫీలింగ్. ఒకవేళ మనతోపాటు వచ్చినా జైల్లో ఉన్నట్టు ఇబ్బంది. ఎవరి పనుల్లో వాళ్ళంపోయి, రాత్రి ఎప్పుడెప్పుడు ఎవరెవరు వస్తారో... కొడుకూ కోడలు మనవలూ ఎవరూ ఎవరితోనూ కనీసం మాట్లాడుకోవడాల్లేని బిజీ బిజీ. ఈ లైఫ్‌లేమిటో వారికసలు అర్థం కాదు. వద్దురా బాబూ! మన దగ్గర అన్నీ ఉన్నా ఉండాల్సిందే ఏదో లేదని వాళ్ళకు తెలుసు. రెండు రోజులకే సంచులు సర్దేస్తారు. అలాగని మనం ఊళ్ళకు వచ్చేసి వారితోనే ఉండిపోవాలని కోరుకోరు. సంపాదన లేని బిడ్డలంటే వారికీ కొంచెం నలుగురిలో నగుబాటే మరి. ఇరుగు పొరుగుతో మన గురించి గొప్పలు చెప్పుకోవాలిగా. అంతే! అమ్మా నాన్న మనమూ చినప్పుడు కలిసి ఏం ఉన్నామో ఏం తిన్నామో.. ఏం గడిపామో అదే మనకు చివరకి మిగిలేది. వీలు కాని జీవితంలోని కొంత టైమ్ తీసి వారికోసం వీలుచేసుకుని అప్పుడప్పుడూ వెళ్ళడం మినహా మరో గత్యంతరం లేదు. మనం వెళ్ళినప్పుడు వారి కళ్ళల్లో ఆనందం మాత్రం ఏ ప్రపంచ భాషలోనూ ఎవడూ వర్ణించి ఉండదు. కానీ ఈ మధ్య నేనొచ్చినప్పుడల్లా స్కూలుకి రాకుండా మారాం చేసే పిల్లల్ని తన కూడా తీసుకు వెళ్ళడానికి వచ్చే బడిపంతుల్ని చూసినట్టు నన్ను అనుమానంగా చూస్తారు. ఈసారి ఏమైనా రమేష్‌తో తీవ్ర ప్రయత్నం చేయించైనా సరే కూడా తీసుకుపోవాలి. అదీ నా ప్లాన్. లేదంటే చెయ్యి విరగిందనో... జబ్బు చేసిందనో.. మాటి మాటికీ ఎవరెవరో ఫోన్లు చేయడం

అస్సలు తట్టుకోలేం.

దొడ్లో ఆరుబయట ఆకాశం కింద మంచాలు వేసుకున్నాం. అమ్మా నాన్న త్వరగానే పడుకుండిపోయారు. మేం ఏదేదో మాట్లాడుకుంటూ ఆకాశాన్ని చూస్తూ రాత్రిని ఆస్వాదిస్తూ చుక్కల్ని లెక్కపెడుతూ ఎప్పుడో కాని నిద్రలోకి జారుకోలేదు. నగరాల్లో దొరకని అనుభవం కదా. బాల్యంలో పొందిన ఆనందం కదా. ఆ జ్ఞాపకాలు, ఇప్పటి ఇరుకు బతుకుల చికాకుల అనుభవాలు, ఇద్దరికీ ఒకే గతం కాబట్టి మాటలూ మౌనం కలగలిసిన ముచ్చటైన రాత్రిని బాగానే ఎంజాయ్ చేశాము. నాలుగింటికే నాన్న లేచిపోయాడు. చీపురు పట్టుకుని వాకిలి.. ఇల్లూ పరపరా ఊడ్చేశాడు. అమ్మ కూడా లేచి తెల్లారక ముందే స్నానం చేసి పనుల్లో పడింది. వాళ్ళ రోటీన్ అలవాటే కాబట్టి నేనూ లేచి కాసేపు వారి చుట్టూ తిరుగుతూ ఏవేవో కబుర్లు చెప్తూ గడిపాను. నేను స్కూల్లో చదువుకునే రోజుల్లో అమ్మ నన్ను తెల్లవారు జామునే లేపేది. లాంతరు దగ్గర నేను చదువుకుంటుంటే అమ్మ మజ్జిగ కవ్వం తిప్పేది. ఆ శబ్దం భలే ఉంటుంది. బహుశా ఆ సవ్వడి వినే దొడ్లో మందారం.. నంది వర్ధనం, గన్నేరు పూలు రేకులు విప్పి నవ్వేవి. ఆ శబ్దం తాకిడికే ఎద్దుల మెడల్లో గంటలు ఘల్లున మోగేవి. పనిపాటలకు పోయే రైతుల కూలీల అరుపులు కేకలు మొదలయ్యేవి. అమ్మ కవ్వం చప్పుడు ఆగిందంటే అక్కడొక వెన్నెల ముద్ద నాకోసం తయారైనట్టే. దానికోసమే త్వరగా మొహం కడుక్కోవడం జరిగేది. ఇప్పుడు నగరంలో బిజీ బిజీ జీవితం.. ఇద్దరు పిల్లల అల్లరి.. అప్పుడప్పుడూ ఏ తెల్లారుజామునో అమ్మ కవ్వం చప్పుడు వినిపిస్తూనే ఉంటుంది. కానీ అమ్మే కనిపించదు. రమేష్ లేచినట్టున్నాడు అప్పుడే తెల్లగా తెల్లారి వెలుగులు మా ఇంటి పెరటి గుమ్మం ముందు తచ్చాడుతున్నాయి చుట్టం ఎవరో వచ్చారని చూడ్డానికి వచ్చినట్టు. చిన్న బల్లమీద ఉన్న బిందెలో నీళ్ళు ముంచుకుని తాగబోయాడు రమేష్. అమ్మ ఎక్కడ చూసిందో కాని ఒక్కసారిగా అరిచింది. 'వద్దు నాయనా! ఆ నీళ్ళు కాదు. ఆగు ఇస్తాను' అని లోపలికి వెళ్ళి చెంబు నిండా మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది. ఆశ్చర్యం రమేష్ మొహం మీద మెరుపులా మెరిసింది.



"ఒక్క చుక్క మంచినీరు దొరకడం లేదురా. పొరుగూరి నుంచి వస్తున్న మినరల్ వాటర్ కొనుక్కుంటున్నాం. ఇప్పుడు నువ్వు తాగబోయిన నీళ్ళు కూడా స్థానిక ఎమ్మెల్యే గారి పుణ్యమా అని టాంకుతో చేస్తున్న సరఫరా. అవి తాగడానికి పనికి రావని వంటకు వాడుతున్నాం. ఈ సరఫరా కూడా ఈ మధ్యనే మొదలు పెట్టారు. త్వరలో ఎన్నికలొస్తున్నాయ్ కదా" అమ్మ వివరణ.

"అరేయ్. వచ్చేప్పుడు పెద్ద పెద్ద ట్యాంకులు చూశాం కదా?" రమేష్ ఆశ్చర్యం.

"బోర్డుంది.. రోడ్డు లేదన్నట్టు. ట్యాంకులుంటాయి. నీళ్ళే ఉండవు." నా సవరణ

"అదేంటిరా మా దగ్గర దొంగిలించిన నీరంతా ఏమైపోయింది? అది మీ దాహం తీర్చడం లేదా..? ఆశ్చర్యంగా ఉందే?" నాకు మాత్రమే వినపడే రమేష్ ప్రశ్న.

"అంత ఆశ్చర్యం వద్దురా. చుట్టూ నదులు కాల్వలు నిండుగా ప్రవహిస్తున్నాయి నిజమే. కాని అవి కొందరి ఇళ్ళవైపే పరుగులు తీస్తాయి. ఇప్పుడిక్కడ బీద బిక్కీ ఇళ్ళల్లో మాత్రమే కాదు... మధ్య తరగతి ఇళ్ళల్లో కూడా ఎడారి ఇసుక మేటలు వేసింది. నువ్వు నమ్మలేవులే కాని రా.. అలా ఊరవతలకి వెళ్ళొద్దాం పద"!

ఇద్దరం బయటపడ్డాం. అలా నడుచుకుంటూ మా ఇంటికి అతి సమీపంలో ఆనుకుని ఉన్న పొలాల వైపు వెళ్ళాం. ఒకప్పుడు మా ఇంటి చుట్టూ పొలాలే ఎక్కువగా ఉండేవి. కాని ఇప్పుడు చేపల చెరువులు.. రొయ్యల చెరువులు ఎక్కువయ్యాయి. వాటిలో నుంచి విడుదల చేసే మురికి నీరు కాల్వల్లో ప్రవహిస్తోంది. తెలిసిన ఒక మిత్రుడి చెరువు దగ్గరకు రమేష్‌ని తీసుకెళ్ళాను. అందులో చేపల పట్టుబడి జరుగుతోంది. ధాన్యాన్ని గుట్టలుగా వేసినట్టు చేపల్ని రాశులు పోసి ప్లాస్టిక్ డబ్బాల్లోకి ఎక్కించడం వాడికి చూడ ముచ్చటగా అనిపించింది.

అలా ఆ చెరువులు దాటుకుని ఇంకొంచెం ముందుకు తీసుకు వెళ్ళాను. రమేష్ సందేహాల శస్త్రాలు సంధించక ముందే వాడికి చెప్పాల్సిన విషయాలు చెప్పాను.

"ఇక్కడ చుట్టూ చాలా మందికి పొలాలు ఉండేవి. అవి రాను రాను కొందరికే సొంతమయ్యాయి. వేలమంది భూములు లేని పేదలుగా మారిపోతే పదుల సంఖ్యలో పెద్దలు మాత్రమే ఇలా చేపలు.. రొయ్యల గుట్టల మీద నిలబడి మీసాలు మెలేస్తున్నారు. మా చిన్నప్పుడు కొల్లేరు వ్యవసాయం కోసమని ఊళ్ళో కోమటాయన దగ్గర నాన్న చేసిన చిల్లర మల్లర అప్పులకు చెల్లుచీటిగా మా పొలాలు గల్లంతయ్యాయి. ఇక్కడుండాల్సిన మా పొలాలు ఏ చెరువులో కలిసిపోయాయో ఇప్పుడు పోల్చుకోలేం. ఊళ్ళో బలిసిన వారు బక్కజనుల పొలాలను సొంతం చేసుకున్నారు. మా చిన్న తాతకు ఊళ్లో వందెకరాలు ఉండేవట. కానీ ఆయన ముగ్గురు కొడుకులు ఇప్పుడు మూడూళ్ళలో ఉన్నారు. ఊళ్లో మాత్రం వారికి సెంటు భూమి మిగల్లేదు. హైదరాబాదైనా ఆగడాల్లంకైనా సాగుతున్న నీతి ఒక్కటే. బలవంతులు దుర్బల జాతిని బానిసలుగా మార్చేయడం. ఇక్కడే కాదు. ఇక్కడికి పది కిలోమీటర్ల దూరంలోనే ఉన్న కొల్లేరులో కూడా ఇదే పరిస్థితి. అక్కడకు మనం టిఫిన్ చేసి బయలుదేరుదాం. నా చిన్ననాటి చెలికాడు రాంబాబు వస్తాడు. వాడు మనల్ని కొల్లేరు తీసుకు వెళ్ళే ఏర్పాట్లు చేశాడు."

ఇలా చెప్తున్నంతలోనే రాంబాబు సైకిల్ తొక్కుకుంటూ



వచ్చాడు.

"ఏరా రాంబాబు! ఏంటి సంగతులు వీడు నా ఆప్త మిత్రుడు రమేష్. ఆంధ్రా దొంగలు ఏం తింటారో ఎలా ఉంటారో కళ్ళారా తిలకిద్దామని వచ్చాడు." రాంబాబుకి రమేష్‌ని పరిచయం చేశాను.

"ఏం కాదులేరా ! కూడా ఇంకో దొంగను వెంట పెట్టుకుని వచ్చావు ఎలాగైనా మీ అమ్మానాన్నని తీసుకుపోదామని. అది జరిగే పని కాదులే." రాంబాబు ముందే నన్ను బెదరగొట్టాడు.

ఇద్దరూ హలో అంటే హలో అనుకున్నారు. రాంబాబు డిగ్రీ మధ్యలోనే చదువుకు స్వస్తి చెప్పి కుటుంబ పోషణార్థం కూలీగా మారిపోయాడు. అన్న అమెరికా వెళ్లిపోయాక ముసలి తల్లిదండ్రులకు అండగా.. ఉన్న ఊరినే నమ్ముకుని ఉండిపోయాడు. రాంబాబు సైకిల్‌ని కాల్వ పక్కనే నిలబెట్టి మాతో కొంత దూరం నడుచుకుంటూ వచ్చాడు.

ఊరిని ఆనుకుని ఉన్న పొలాల మధ్య మరుగుదొడ్డిలాంటి దారిని దాటుకుని కొంత దూరం నడిస్తే మాదిగ్గూడెం వస్తుంది. ఊళ్ళో చచ్చిన గొడ్ల అస్థిపంజరాలతో కంపుకొట్టే వాతావరణం మధ్య గూడెం జనాలు కాపురాలుండేవారు. మా నాన్న చేసే కొల్లేటి కమతాల్లో గూడెం జనాలు కొందరు పనిచేసేవారు. పనే కాదు. ఆ కమతాల్లో వారికి వాటా కూడా ఉండేది. అలా చిన్నప్పటి నుంచి దావేదు మా కుటుంబానికి సన్నిహితంగా ఉండేవాడు. వాళ్ళబ్బాయే రాంబాబు. వాడిని రాంబాబు అని పిలిచేది నేను ఒక్కడినే. ఊళ్లో జనమంతా వాణ్ణి రామిగా అనో చిన్ని దావేదుగాడనో పిలుస్తారు.

"ఒరేయ్ రాంబాబు.. ఇక్కడ మీ గూడెం ఆనవాళ్ళేమీ కనిపించడం లేదు. ఏంటి సంగతి?"

"ఇక్కడ గూడేన్ని లేపి ఊరవతల కట్టించిన ఇందిరమ్మ ఇళ్ళల్లో కూర్చోబెట్టారుగా.. తెలియదా..?" అన్నాడు రాంబాబు. ఈ మధ్య చాలాసార్లు వచ్చినా రాంబాబును కలవడం కుదరలేదు. అందుకే ఈ మార్పు తెలుసుకోలేకపోయాను.

వారసత్వంగా వచ్చిన ఇళ్ళూ ఊరవతలే. ప్రభుత్వం ఇచ్చిన ఇళ్ళూ ఊరవతలేనా? కనీసం ఇప్పుడు కట్టిన ఇళ్ళన్నా ఊరి మధ్య కడితే ఎంత బావుండు. నాలో మెదిలిన ప్రశ్న రాంబాబుకు అర్థమైనట్టుంది. ఒక చిన్న నవ్వు వదిలి ముందుకు కదిలాడు. రాంబాబు వాళ్ళ గుడిసె ఎక్కడ ఉండేదో ఆ దిబ్బను చూపిస్తేనే కాని నాకు జ్ఞాపకం రాలేదు. ఇక్కడ ఒకప్పుడు ఒక జన సమూహం ఉండేదని.. దీపాలు లేకపోయినా తెల్లవార్లూ పాటలు పద్యాలతో ఆ పల్లె వెలిగిపోయేదని అప్పుడు గాని గుర్తుకు రాలేదు.

రాంబాబుతో నా స్నేహం ఆ ఊరవతలి బతుకుల పట్ల నాలో సానుభూతినే కలిగించింది కాని అసహ్యాన్ని కాదు. ఊరి చుట్టూ ఎంత పచ్చని అందం అల్లుకుందో ఇక్కడి దళితుల బతుకుల లోపలా బయటా అంత కారు చీకటి ఆవహించి ఉండేది. ఆ పచ్చదనం ఈ గుడిసెల గుమ్మాల దాకా ఎందుకు పాకలేదని చిన్నప్పుడు ఎంతగానో బాధపడేవాణ్ణి పెద్దయ్యే కొద్దీ రాంబాబులో కూడా ఈ బాధ అగ్నిపర్వతమై కూర్చుంది. కొంచెం పెద్దయ్యాక మాకిద్దరికీ అర్థమయ్యింది. ఊళ్ళ చుట్టూ ఉన్న ఆకుపచ్చ సౌందర్యం.. పంటకాల్వల గలగలలూ.. ఊరిని పలకరించి పోయే ఆరు రుతువుల అందాలూ అన్నీ కొందరికే సొంతమైనట్టు నేనూ రాంబాబు సమానంగానే గమనించాం. ఎందుకో కాని తరువాత్తర్వాత రాంబాబు చదువు మానుకుని కూలీల దండుకట్టే దండనాయకుడయ్యాడు. నేను ఉద్యోగం వేటలో ఊరొదిలి పారిపోయాను. ఇలా కలిసినప్పుడు ఆనాటి బాల్యాన్ని.. ఈనాటికీ మారని బడుగుబతుకుల చిత్రాన్ని కలబోసుకుంటాం. వాడు ఉద్రేకపడతాడు. నేను ఊకొడతాను. మా ఇద్దరి బాల్యపు ముచ్చట్ల మధ్య ఇక్కడ ఒకప్పుడుండే గూడెం స్వరూపాన్ని రమేష్ అర్థం చేసుకున్నాడు.

మాటలు.. జ్ఞాపకాలు.. ఊళ్ళో సాగుతున్న తతంగాలు అన్నీ రాంబాబు చెప్తూ మేం వింటూ అలా కొంతసేపు తిరిగి తిరిగి ఇంటికి చేరుకుని టిఫిన్లు ముగించాం. రాంబాబు మా కొల్లేరు యాత్ర ఏర్పాట్ల కోసం ఇంటి కెళ్ళాడు. మేం రెడీ అయ్యేసరికి ఒక బైక్‌తో ప్రత్యక్షమయ్యాడు. ముగ్గురం బర్రున కొల్లేరు వైపు దారి తీశాం.

మాకోసం ముందే ఏర్పాటు చేసిన చిన్న పడవ ఎక్కి వెనక్కి వెనక్కి కుంచించుకుపోతున్న కొల్లేరు సరస్సుల్లో విహారానికి బయలుదేరాం. చుట్టుపక్కల ఊళ్ళను ఉద్ధరించడానికే పుట్టినట్టు రాజకీయాల్లోనూ వ్యాపారాల్లోనూ తమ కబ్జా జమాయించిన పెద్దలు పేదల కమతాలను ఆక్రమించుకున్నారు. కొందరికి తాగించి.. కొందరికి భూములకు భూములిస్తామని చెప్పి ఊరించి.. లొంగని వారిని కొద్దిపాటి డబ్బుతో కొనేసి.. ఎవరి మాటా వినని సీతయ్యలాంటి వారిని భయపెట్టి కొల్లేటిలో పేదల భూముల్ని పెద్దలు స్వాధీనం చేసుకున్నారు. కొల్లేటి సరస్సును కొల్లగొట్టి దాన్ని చిన్న చిన్న చేపల చెరువులుగా కత్తిరించి తమ ఖాతాలో వేసుకున్నారు. మా చిన్నప్పుడు మా నాన్న నిర్వహించిన కమతాలు అలా మాయమైపోయినవే. రాంబాబు వాళ్ళ కుటుంబానికి కూడా కొద్దోగొప్పో భూములుండేవంటే ఈ కొల్లేరులోనే. అవన్నీ ఇప్పుడు పరాధీనమైపోయాయి.

ఊళ్ళో ఎంతో గౌరవప్రదమైన స్థానం ఉన్న మా నాన్న లాంటి పెద్ద రైతులే పేదరైతుల్లా బతుకుబండి లాగుతున్నారు. ఇక రాంబాబులాంటి గూడెం జనాలు గోడు ఎవరు పట్టించుకుంటారు? నా ధోరణిలో నేనేదో చెప్తున్నాను.

ఏందిరా బాయ్ మీరేదో ఆనందాన్ని అనుభవిస్తున్నారని చూద్దానికి నేనొస్తే అన్నీ కష్టాలే వల్లిస్తున్నారు? అంటూ రమేష్ ఎగిరి మా పడవలో పడిన చేపను పట్టుకుని ముచ్చటగా ముద్దాడాడు. అప్పటికే మా పడవ నడపుతున్న మనిషి చిన్న చిన్న

చేపల్ని పట్టుకుని మాకోసం కాల్చి పెట్టడానికి పడవలోనే అన్నీ ఏర్పాట్లు చేసి పెట్టాడు. పేరు రాముడు. మా చిన్నప్పుడు రాముడు కాదు భీముడు అనేవారు. ఇప్పుడు కొల్లేరు చిక్కిపోయినట్టే కొంచెం కొంచె ఎండిపోయి కండ తీసేసిన కొరమేను ముల్లులా తయారయ్యాడు. చేపల రుచి... ప్రకృతి రుచి.. అనుభవిస్తూ కొల్లేటి అంతరంగంలోని విషాదం చేదును మర్చిపోదామని రమేష్‌తో మేం కూడా ప్రయత్నించాం.

ఏం బాబూ అసలు ఊరికి రావడమే మానేశారు? రాముడు కాల్చిన చేపలతో పాటు కొన్ని ప్రశ్నల్ని కూడా మా వైపు పంపడం మొదలెట్టాడు. వాణ్ణి కదపకూడదనే అనుకున్నాను. కదిపితే కొల్లేరు డొంక కదిపినట్టే. ఏ డొంకలో ఏ పిట్టలుంటాయో.. ఏ పిట్ట ఏం తింటుందో ఎలా తింటుందో.. ఎంత ఒడుపుగా దాన్ని పట్టుకోవాలో కతలుకతలుగా చెప్తాడు. ఏ కాలంలో ఏ పక్షులు వచ్చేవో... ఎంతకాలం ఉండేవో కల్లాకపటంలేని కొల్లేటి కొంగల భాషలో వర్ణించి పాడతాడు. అంతటితో ఆపడు. ఆపితే రమేష్‌కి మంచి వినోదమే దొరకేది. కాని వాడి కథ మొదలుపెడతాడు. ఇప్పటికే రమేష్‌కి ఇక్కడి వాతావరణం కంటే దాని వెనక సాగుతున్న దోపిడి కాస్త అసహనానికి కారణమవుతోంది. ఎందుకొచ్చానురా బాబూ అని తలపట్టుకుంటాడేమో అని నా సందేహం. కాని వాడూరుకుంటాడా. కదపనే కదిపాడు రాముడి కొల్లేటి డొంకని. వాడి యవ్వనంలో కొల్లేరు ఎంత గొప్పగా ఉండేదో.. ఇక లంకించుకున్నాడు.

"నా మాలచ్చిని చూసినా కొల్లేటిని చూసినా నాకు రత్తంలో ఒకటే తియ్యని దురద మొదలయ్యేది బాబయ్యా. ఆ రోజులే వేరు. వర్షాలు తగ్గి నీరు వెనక్కి తీసినప్పుడు ఇక్కడ ఎగసాయం మా జోరుగా సాగేది. నాక్కూడా ఏడెనిమిది ఎకరాల ఎగసాయం ఉండేది. ఇదిగో ఈళ్ళ నాన్నగారు కమతాలనీ.. కలిసి ఎగసాయం చేసుకోవాలనీ మొదలెట్టాక అబ్బో అదో పండగలా సాగేదనుకోండి.. ఊళ్ళో జనాలు ఎలాగుండే వారో కాని... ఇక్కడ మాత్రం ఊరు వాడా తేడా లేకుండా అందరం అల్లదిగో ఆ ఎగురుతున్నాదే చేప పిల్ల. మరలా ఎగిరి గంతులేసే వాళ్ళం. కలిసి వండుకునే వాళ్ళం. కలిసి పండుకునే వాళ్ళం. వారాల పాటు ఇళ్లకు పోకుండా ఇక్కడ మేం ఎగసాయం చేస్తా ఉంటే మా ఆడది అప్పుడప్పుడూ అనుమానంతో ఇక్కడికి లగెత్తుకొచ్చేది. మాలచ్చి వచ్చిందంటే ఇక నాకు పండగే. అందరూ నన్ను వదిలేసే వారు. దాన్ని తీసుకుని అదిగో ఆ దోనెలున్నాయే అలాంటి తాటి దోనెలో ఇక కొల్లేరులో ఒకటే తిరుగుడు. దూరంగా ఎవరికీ కనిపించకుండా దాన్నెటో తీసుకుపోయేవోణ్ణి. ఇప్పుడు నేనిస్తన్నట్టే అది నాకు చేపలు కాల్చి పెట్టేది. నేను పాటలు పాడేవోణ్ణి. నాసామిరంగా నేను పాటలు పాడతా వుంటే ఎగిరే పచ్చులు కూడా అల్లాగిపోయేవనుకోండి. అయ్యా.. పిట్టల మాటేం కాని ఆకాసంలో సూరీడు కూడా ఆగిపోయేవాడంటే నమ్ముతారా?"

'నమ్ముతాం నమ్ముతాం', రమేష్ ఊతమిచ్చాడు. ఆ ఊతంతో పాటందుకున్నాడు. మేమంతా ఎక్కడన్నా పక్షులు ఎగురుతూ ఆగి వెనక్కి చూస్తాయేమో అని దిక్కులు చూశాం. పక్షులుంటేగా! ఖాళీ డొంకలు వెక్కిరిస్తున్నాయి. అటు ఆకాశం వైపు చూశాం. నిజంగానే సూర్యుడు నిదానంగా కదులుతున్నాడు.



'ఇప్పుడేం చేస్తున్నావ్ రాముడు?' అడిగాడు రమేష్.

ఏం చేస్తాం బాబయ్య. ఆ ఎగసాయం లేదు. ఆ బూములు లేవు. ఆ పనీ లేదు ఆ పాటా లేదు. ఉన్న కమతాలన్నీ పెద్దోళ్ళ చేపల చెరువుల్లో ఎక్కడ కలిసిపోయాయో తెలీదు. కాగితాల మీద ఏలి ముద్రలు ఏయించుకున్న గ్నాపకాలు తప్ప ఇంకేం గుర్తులేదు. ఇదిగో ఇప్పుడు ఆ చెరువుల దగ్గర కాపలా కాసే పనోడిగా బతుకుతున్నాను. తాగడానికి నీళ్ళు కూడా లేవు. ఈ కుళ్ళు నీరు తాగి నేనైతే సయించుకున్నాను కాని... నా ఆడది మాత్తరం కుంగి కుశించుకుపోయింది. మాయదారి రోగం కానరాలేదు. కానొచ్చినా బాగుచేసుకునే సత్తా వున్నోణ్ణి కాదు. అలాగే అర్థాంతరంగా మాయమైపోయింది మాలచ్చిమి. బిడ్డలకి రెక్కలొచ్చాక ఇక్కడ రెక్కాడినా డొక్కలాడ్డం కష్టమని నగరాలకి వలస పచ్చుల్లా ఎగిరిపోయారు."

ఉన్నట్టుండి రాముడు.. నేను.. రాంబాబు ముగ్గురం సైలెంట్ అయిపోయాం. రమేష్ కూడా మాతో పాటు నిశ్శబ్దంగా ఏదో ఆలోచనలో పడిపోయాడు. ఎగిరే చేపపిల్లల్లో చిన్నప్పటి జ్ఞాపకాల తుళ్ళింతల దృశ్యాలేవో దోబుచులాడుతూ నన్ను ఉడికిస్తున్నాయి. నాన్న పొలాలు పోగొట్టుకున్న తర్వాత చుట్టం చూపుగా కొల్లేరు రావడమే అవుతుంది కదా అన్న బాధ కొంచెం గుండెల్లో మెలిపెట్టింది. రాంబాబు మనసులో ఏం జరుగుతుందో నేనూహించగలను. గతం వర్తమానం కలిసి అతని మనసులో ఒక ద్రావకంలా మరుగుతున్న విషయం అర్థమవుతోంది. ఇక రాముడు ఫ్లాష్ బ్యాక్ లోకి జారిపోయిన సంగతి తెలిసిపోతోంది. రాముడు పాలేరుగా మారడం.. రాంబాబు కూలీగా మిగిలిపోవడం.. కాస్త కలిగిన కుటుంబంలో పుట్టినా చివరికి ఊళ్ళో బలవంతులకే ఆస్తులన్నీ ఫలహారంగా సమర్పించుకుని ఇప్పుడు మేము ఇల్లు తప్ప ఏమీ మిగుల్చుకోలేకపోవడం. ఈ విషయాలన్నీ రమేష్‌కి కూడా అర్థమైనట్టున్నాయి. వాడూ మా నిశ్శబ్దంలో మరింత నిశ్శబ్దంగా ఒదిగిపోయాడు.

అలా కొల్లేటి కొంగలు సంధ్య రంగుల ఆకాశాన్ని తమ రెక్కల మీద ముద్రించుకుని ఒకగుంపుగా మా కళ్ళను తాకుతూ ఎగిరినప్పుడు ఇళ్ళకు తిరుగుముఖం పట్టాం.

ఇంటికి రాగానే నాన్న కనిపించలేదు.

అమ్మా నాన్నేడి ?



"ఈ మధ్య గుడి కట్టిస్తున్నారుగా.. శివాలయం. పొద్దస్తమానం అక్కడే గడిపేస్తున్నార్రా బాబూ. అన్నట్టు మీ ప్రయాణానికి అన్నీ రాత్రికే సర్దుకోండి నాన్నా. పొద్దుటే లేచి తాడేపల్లి గూడెం వెళ్లాలిగా. ఇలా ఒకరోజు ప్రయాణాలేంటిరా! పోన్లే కనీసం నెలకోసారైనా రా! మేమెలాగూ ఈ రైళ్ళూ బస్సులూ ఎక్కలేం!"

అమ్మ మాటల్లో నాకెందుకో ఏదో కనిపించని ఆరా.. అన్వేషణ.. ఇంకేదో ప్రశ్న గుండెల్ని తాకుతున్నాయి. నేను వచ్చిన వాడిని వచ్చినట్టే తిరిగి వెళ్ళిపోతానని.. వాళ్ళను నాకూడా తీసుకు వెళ్ళే ప్రయత్నాలేమీ చేయనని అమ్మ ఇంకా కన్‌ఫాం కాలేదు. వారికి ఏ మూలో అనుమానం ఉంది. అందునా ఈ సారి ఒంటరిగా రాలేదు. హైదరాబాద్ మిత్రుణ్ని వెంటేసుకుని సశస్త్రంగా వచ్చాను.

అమ్మా ఈసారి మిమ్మల్ని తీసుకుని వెళ్ళడానికే వచ్చాను. మీరు కూడా బట్టలు సర్దుకోండి.

"వచ్చే నెల్లో వస్తాంలే నాన్నా. నా బ్యాగూ నాన్న బ్యాగూ పక్కింటి పార్వతి తీసుకుంది. ఊరికెళ్ళాలంట. పాపం ఎప్పుడూ మమ్మల్నే కనిపెట్టుకుని ఉంటుంది. దానికేమైనా చెయ్యాలిరా!" అమ్మ జవాబు.

అమ్మ మాటలు నాకెందుకో నమ్మబుద్ధి కావడంలేదు." అయినా బ్యాగులదేముంది. ఇప్పుడే పోయి రెండు కొత్తవి కొనుక్కొస్తానుండు." అమ్మ ఏదో గొణుగుతున్నా వినకుండా బయలుదేరాను. రమేష్ స్నానానికి వెళ్ళాడు.

ఎక్కడికిరా?

నాన్నని తీసుకువస్తా

అప్పుడే వస్తాడా ఆయనగారు. మీరు ముందు స్నానాలు ముగించండి.

అమ్మ మాటలు వినకుండా త్వరగా గుడి దగ్గరకు బయలుదేరాను. పక్కింటి పార్వతి ఎదురుపడింది. బ్యాగులు తీసుకువెళ్ళి అమ్మే పార్వతి ఇంట్లో దాచిపెట్టిందట. వచ్చే నవ్వు ఆపుకోడానికి పార్వతి చీరకొంగును సాయం తీసుకుంది.

చిన్నప్పుడు స్కూలు ఎగ్గొట్టడానికి నేను కూడా ఇలా ఎన్నిసార్లు పుస్తకాల సంచి అక్కడా ఇక్కడా దాచిపెట్టేవాడినో. ఎక్కడ దాచానో అమ్మకు మాత్రమే తెలుసు. నాన్న వెదికి వెదికి నన్ను ఉతకడానికి రెడీ అయినప్పుడు 'పోన్లెండి రేపు వెళతాడులే బడికి' అని అడ్డం పడేది అమ్మ. చిన్నప్పుడు నేనేసిన ఎత్తులన్నీ ఇప్పుడు నా దగ్గర అమ్మ ప్రదర్శిస్తోందన్నమాట. నవ్వుకుంటూ గుడికి వెళ్ళాను. అక్కడ నాన్న ఒంటరిగా కూర్చుని ఉన్నాడు. నన్ను చూసి ఏరా పొద్దునే వెళ్ళాలన్నారు. త్వరగా తిని రెస్టు తీసుకోండి. ఇదిగో గుడి కడుతున్నాంగా ఇప్పటిదాకా మీటింగే సరిపోయిది. అంతా ఇప్పుడే వెళ్ళారు.

"ఎందుకు నాన్నా ! మిమ్మల్ని బలవంతంగా తీసుకువెళ్ళనులే. కనీసం నేను ఉండే ఒక పూటైనా ఇంటి దగ్గర ఉండొచ్చుగా ! రాపోదాం" నాన్న చేయి పట్టుకుని పైకి లేపాను.

"మళ్లీ ఎప్పుడొస్తార్రా? ఈసారి కోడల్ని.. పిల్లల్ని తీసుకురావాలి మరి ఆ !"

నేను చిన్నప్పుడు బడికి ఎగనామం పెట్టి పాత శివాలం దగ్గర గోళీలాడే వాడిని. ఆ విషయం నాన్న కెవరో చెప్పేవారు. దారినపోయేవారెవరో పెద్దమనిషి ఒరే మీ నాన్నొస్తున్నాడని బెదిరిస్తే గుడిదగ్గరే రాత్రి దాకా ఉండిపోయేవాడిని. ఎప్పుడో చీకటి పడ్డాక నాన్న వెదుక్కుంటూ వచ్చేవాడు.

"అమ్మ దొంగా నా దగ్గరే నా చిన్నప్పటి ట్రిక్కులు ప్లే చేస్తున్నావా నాన్నా" అసలింత అవసరమా? మనసులోనే అనుకుని నాన్నతో ఇంటికి చేరుకున్నాను.

ఇంటికి రాగానే స్నానాలు చేసి ఒకసారి రాంబాబు ఉంటున్న ఊరవతల కాలనీకి వెళ్ళాము.

అక్కడ రాంబాబు కాలనీ చూసి మరీ బాధ కలిగింది. చూడ్డానికి దూరంగా ఇళ్ళలానే కనిపిస్తాయి. కాని అవి తలుపులూ కిటికీలూ లేని అగ్గిపెట్టే గుడిసెలంటే తప్పు కాదు. అక్కడ కూడా కాలనీలు ఏర్పడ్డాయి. దళితులు ఒక పక్కకి.. వారికి దూరంగా ఇతర కులాల ఇందిరమ్మ ఇళ్ళు మరో మూలకి ఉన్నాయి. అభివృద్ధిని అంకెల్లో చూపించే వారికి ఈ కాలనీలను చూపిస్తే ఏమంటారో మరి. రాంబాబు నాన్న దావీదుతో కాసేపు మాట్లాడాము. ఆయనా పాత ముచ్చట్ల నడమ ఊరి గురించి బాధనే నిట్టూర్పుల భాషతో వ్యక్తం చేస్తున్నాడు.

ఇక రాంబాబు ఇంటి దగ్గర సెలవు తీసుకుని మా ఇంటికి ముగ్గురం వెళ్ళాం వేడి వేడిగా అమ్మ వడ్డించింది. నాతోపాటు అమ్మనీ నాన్ననీ తీసుకు వెళ్ళే ప్రయత్నంలో మరోమాటు భంగపాటు చవిచూసి గమ్మున ఊరుకున్నాను. రాంబాబు కూడా ఆ రాత్రికి మాతోనే ఉండిపోయాడు. ఊరూ.. వాడా.. రిజర్వేషన్లు.. ఎవరు ఎదిగారు. ఎవరు కుదేలయ్యారు.. రాంబ-బు ఏదో తన రహస్య రాజకీయ కార్యకలాపాల గురించి మాట్లాడుతూనే ఉన్నాడు. మర్నాడు ఉదయమే లేచి స్నానాలు చేసి తాడేపల్లి గూడెం బయలుదేరాం. మళ్ళీ తిరిగి జన్మభూమి ట్రైన్ లోనే ప్రయాణం.

వెళుతూ వెళుతూ రమేష్ నాన్నతో మళ్ళీ కొంచెం కదిపి చూశాడు.

"ఏంటంకుల్.. ఇక్కడేముంది? తాగడానిక్కూడా నీరు లేదు. మాకెలాగూ తెలంగాణా ఇచ్చేస్తున్నారుగా అక్కడికే వచ్చేయండి."

ఏం సమాధానం వస్తుందో అని ముగ్గురం ఉత్కంఠగా ఎదురుచూశాం.

"లేదు. ఎక్కడికీ రాము".

నాన్న నుండి వచ్చిన ఈ తపీమన్న సమాధానంతో నేనూ రాంబాబు నవ్వుకున్నాం కాని రమేష్ మాత్రం ఆశ్చర్యంగా అలాగే నోరు తెరిచి ఉండిపోయాడు.

"ఏమీలేదురా బాబూ. మీకు తెలంగాణా వస్తేనన్నా కనీసం ఇక్కడ ఊళ్ళు బాగుపడతాయేమో అని మా ఆశ".

"అధికార బదలాయింపులతో ఊళ్ళు బాగుపడవు అంకుల్. ఆ అధికారం ఎవరి చేతుల్లోకి పోతుందన్నదే పాయింట్. స్వతంత్ర పోరాటం ఎప్పుడూ సమరోత్సాహంగానే ఉంటుంది. స్వాతంత్ర్య ఫలితాలు ఎవరికి దక్కుతాయన్నదే చూసుకోవాలి." ఇక రాంబాబు దొరికిందే తడవుగా అందుకున్నాడు. నాన్న కూడా తీరిగ్గా ఉపన్యాసానికి ఉపక్రమించాడు.

అంతా హైదరాబాద్‌కే పరుగులు తీశారు తప్ప పుట్టిన ఊళ్ళు.. పెరిగిన ఊళ్లు ఎలా ఉన్నాయో ఎంత ధ్వంసమవుతున్నాయో పట్టించుకునేతీరికా ఓపికా ఎవరికీ లేకుండా పోయింది. రాజకీయ నాయకులకు రాజకీయాలు కావాలి. పదవులు కావాలి. పీఠాలు కావాలి. పెట్టుబడిదారులకు వ్యాపారాలు కావాలి. ఏ వూరు ఎలా పోయినా పర్వాలేదు. వారి పెట్టుబడులు పెరగాలి. హైదరాబాదైనా పోతారు... ఆఫ్రికా అయినా పోతారు.. వారికి మట్టి బంధాలు.. మమతానుబంధాలు ఉండవు. ఉన్నదొక్కటే బంధం అది డబ్బు బంధం. నగరాలేవైనా వారికే ఉంపుడుగత్తెలు. మనం మన రాష్ట్రంలో ఉన్నా.. మన దేశంలో ఉన్నా.. ఈ నేల మనది.. ఈ గాలి మనది.. ఈ నీరు మనది అన్న ఏదో తెలియని భావంలో ఉప్పొంగిపోతాం. తీరా హక్కులు అనుభవించే సరికి ఎక్కడా నీకు కూర్చోడానికి కూసింత జాగా కూడా దొరకదు. పొరుగు రాష్ట్రం నుంచి వచ్చినా డబ్బున్న వాడికి పక్కవేసే నగరంలో నిజానికి నువ్వు అనాథవే. కూలికోసం ఉదయాన్నే నాలుగురోడ్ల కూడలిలో నిలబడే వేలాది జనానికి నగరం ఎప్పటికీ పరాయిదే. వారితో పనిచేయించుకుని వారిని కుక్కలకంటే హీనంగా చూడ్డమే నగర సంస్కృతి వికృత రూపం. అలాంటి నగరం కోసం ఏడవడం కంటే కనీసం ఇప్పటికైనా మన ఊళ్ళను బాగుచేసుకుందాం అన్న స్పృహ మా వాళ్ళకి కలిగితే అదే పదినగరాలపెట్టు." నాన్న ఉపన్యాస ధోరణికి బ్రేక్ వేస్తూ రాంబాబు అందుకున్నాడు.

"రమేష్ ! జన్మభూమి అన్నది ఒక ఫీలింగ్ మాత్రమే. అది సామాన్యులకే కాని పెట్టుబడుల గుండెకోటల్లో అది మొక్కుబడిగానైనా ఉండదు. జన్మభూమి భావనే అందరినీ సమానంగా ఆదుకుంటే స్వతంత్రం వచ్చిన ఇన్ని దశాబ్దాల తర్వాత కూడా అన్నార్తులు. అభాగ్యుల శాతమే ఎందుకు ఎక్కువగా ఉంటుంది చెప్పు? కూలికోసం కూటికోసం నిలువ నీడ కోసం నువ్వక్కడా మేమిక్కడా పోరాటాలు చేయాల్సిందే. అధికారాలు.. హక్కులూ సామాన్యులకు అందని ద్రాక్షల్లా ఉన్నంతకాలం యుద్ధం ఎక్కడైనా ఒకటే. ప్రాంతీయభేదాలు మామూలు మనుషులకే కాని దొంగలకు ఉండవురా బాబూ. యువకులను బలిపెట్టి మీరు సాధించిన ఈ స్వతంత్రం ఈనగాచి నక్కల కుక్కల పాలు కాకుండా కాపాడుకోండి. అందుకోసం ఒక మహాసంగ్రామానికి సిద్ధం కావాలి మరి. ఇక మీ తిప్పలు మీరు పడాలి. మా తిప్పలు మేం పడతాం. అందరి తిప్పలూ ఒకటే అని వాటంతటికీ పరిష్కారం కూడా ఒకటే అని.. దానికోసం నువ్వూ నేనూ వీడూ వాడూ అంతా కలిసే కత్తుల నదిలో ఈదాలని మాత్రం మర్చిపోవద్దు సుమా!"



నాన్న మాటలు, రాంబాబు మాటలు విన్న తర్వాత హైదరాబాద్ విషయంలో జన్మభూమి ఫీలింగ్‌తో బరువెక్కిన నా హృదయం ఇప్పుడు కాలిపోతున్న నుదుటి మీద అమ్మ చేయి పడినంత హాయిగా ఉంది.

పొద్దుటే తిరుగుప్రయాణం రాంబాబు వాళ్ళ నాన్న దావీదు కూడా వచ్చాడు. మా వీధిలో ఉండే సోమన్న కూడా వచ్చాడు. మా ఊళ్ళో మొదటి డాబా ఇల్లు కట్టిన మొనగాడు అతడే. ఇరవై ఎకరాల ఆసామి. ఇప్పుడు నిలువ నీడ లేదు. ఇద్దరు కొడుకులు హైదరాబాద్‌లో అపార్ట్‌మెంట్ల దగ్గర వాచ్‌మెన్‌లుగా పనిచేస్తున్నారు. నేనెప్పుడొచ్చినా వారి దగ్గర నుంచి వర్తమానం కాని... డబ్బులు కాని ఏమైనా వస్తాయేమో అని నన్ను పలకరిస్తాడు. మేం వెళుతుంటే అమ్మా..నాన్న.. దావీదు. సోమన్న అలా శూన్యంగా చూస్తు నిలబడిపోయారు. ఊరు వెనక్కి వెళుతుంది మేం ముందుకు కదిలాం. నిర్వాహకులు ఎవరూ లేని అనాథ వృద్ధశరణాలయంలా కనిపించింది నాకు మా ఊరు.

ట్రైన్ ఎక్కించి రాంబాబు వెళ్ళిపోయాడు. అన్నీ కోల్పోయినా, ఉన్న ఊరినే జన్మభూమి అని మా అమ్మానాన్నలాంటి వృద్ధులెందరో ఆ మట్టినే అంటిపెట్టుకుని ఉంటున్నారు. రాంబాబు మాత్రం జన్మభూమి ఒకఫీలింగే అంటాడు. హైదరాబాద్ నా జన్మభూమి కాదంటే నా గుండె తట్టుకోలేకుండా ఉంది. రమేష్ మాత్రం నా జన్మభూమి అని ఎంతో ఉప్పొంగిపోతూ రాగాలు తీస్తున్నాడు. అసలు జన్మభూమి విషయంలో నీ అభిప్రాయం ఏంట్రా అని రమేష్‌ని అడిగాను. "అరేయ్ లైట్ తీసుకో మనం ఇప్పుడు ప్రయాణం చేస్తున్నది జన్మభూమి ట్రైన్ లోనే" అని పకాలున నవ్వేసాడు. వాడి మాటలతో తేలికైన మనసు కాసేపు అలా రైలు కిటికిలోంచి బయట పచ్చదనం మీదికి మళ్ళింది. ఇంతలో ఏమనుకున్నాడో రమేష్" అరేయ్ పాగల్‌గా ఏమనుకుంటున్నావో నాకంతా తెలుసు. ఇదిగో చూడు రాష్ట్రం ముక్కలైనా మన స్నేహాన్ని ముక్కలు చేసే శక్తి ఎవరికీ లేదురా బాయ్. మన అసలు జన్మభూమి స్నేహమేరా. దాని పరిమళం తెలుగు."

జన్మభూమి ఎక్స్‌ప్రెస్ తనకేమీ తెలియనట్టు దడదడా ముందుకు సాగిపోయింది.



## ఆగష్టు నెల పురస్కారాలు



**ఎవడిదిరా భూమి**

**కథకు : రూ.700/-**

రచయిత : మొలకపల్లి కోటేశ్వరరావు

**పాత పాటగా వినిపించే సరికొత్త పాట**

**కవితకు : రూ.500/-**

రచయిత : సాహిత్య ప్రకాష్

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాదు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

**ఆగష్టు నెల వ్యాసం**

'చిలుకూరి దేవపుత్ర గురుదక్షిణ కథ - దళిత స్పృహ'

రచయిత : యం. ఆదిశేషయ్య

ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం' రూ. 500/- అందజేయబడుతుంది.

- ఎడిటర్

## పర్జన్యము

- నూనెల శ్రీనివాసరావు
9032883206

ఏదీ ఇక్కడ
దిక్కులు పిక్కటిల్లేలా
నినదించిన
హర హర మహాదేవ
జయ జయ ధ్వానాలు -
ఏదీ ఇక్కడ
ముకుళించిన చేతుల నుండి
విద్యుల్లతలా పాకిన
భక్తి పారవశ్యాలు
తన్మయ పూనకావేశాలు -
ఏవీ ఇక్కడ
దూపదీప నైవేధ్యాల
దగదగలు
శ్రీ చందన సుమగంధాల
గుమగుమలు -
ఏవిక్కడ
నుదుటిపై అరుణోదయాన్ని
పులుముకొని
కళ కళ కదిలే
పచ్చతోరణాలు
ఏవిక్కడ
చెంగు చెంగున
లేడి పిల్లలా గంతులేసే
సెలయేటి గలగలలు -
ఏవిక్కడ నీడ నిచ్చే తరువులు
ఏవిక్కడ తోడు నిల్చేకువకువరావాలు -
అయ్యో ఏమిటిది !!!
వెలుగులు మింగేసే
చీకటి ముసురుకుందేం ?
కలలను ఊడ్చేసే
కన్నీరు పొంగుతుందేం ?
అంతటా విరిగిపడ్డ శకలాల
మూలుగులు వినిపిస్తున్నాయేం ?
ఇంతలా నదీనదాలు రోదిస్తున్నాయేం ?
ఒక రెప్పపాటు కాలాన
వేయి పడగలెత్తి
విరుచుకు పడిన
గంగమ్మదేనా ఈ పాపం ?
అందని శిఖరాలు అందుకొన్న
అహంకారంతో విర్రవీగే
నరుని వెర్రి చేష్టలుదేనా ఈ ఘోరం ?
వెదికితే నిజాలు
శూలాలై
మన గుండెలకే
గురిపెడతాయేమో !
కదిపితే వాస్తవాలు
మన నెత్తిన
అణుబాంబులై



బద్ధలౌతాయేమో !
మట్టిలో పుట్టిన మనం
ప్రకృతి ఒడిలో పాపాయిగా
పోరాడితేనే
అది చరణాలుగా విచ్చుకొని
కమ్మని పాటై పల్లవిస్తుంది -
గెలుపు బలుపుతో
శివాలెత్తి దానిపై
కత్తులు దూస్తే
కాలాంతకమై
విరుచుకుపడుతుంది -
చివరకు
నువ్వు శరణన్న దేవుడ్ని కూడా
నీతో పాటు ఊడ్చేస్తుంది.

# భ్రష్టుపట్టిన రాజకీయాల చిత్రాలు

## నన్నపురెడ్డి కథలు

- రాచపాళెం చంద్రశేఖరరెడ్డి

9440252211




**అప్పుడప్పుడు ఎన్నికలలో కొన్ని అద్భుతాలు జరుగుతున్నా ప్రజాస్వామ్య పదానికున్న విస్తృతార్థం ఇంకా జీర్ణం కాలేదు. కొంత మినహాయింపుతో ఆంగ్లేయులు వదిలిపోయిన భూస్వామ్య పెట్టుబడిదారీ సంకర రాజకీయమే కొనసాగుతున్నది. రాజకీయ పార్టీలు, ఎన్నికలు, గెలుపులు, ఓటములు కనిపిస్తున్నాయి. గనక ఇది ప్రజాస్వామ్యమనుకుంటున్నాం. ప్రజాస్వామ్యానికున్న విస్తృతార్థం మనకింకా జీర్ణంకాలేదనే సత్యాన్ని నన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి తన రాజకీయ కథలలో ఆవిష్కరించాడు. పాలెగాళ్ళ, ఫాక్షనిస్టుల ప్రాంతమైన రాయలసీమ కేంద్రంగా ఆయన కథలు రాశాడు.**

ఏ సమాజానికైనా రాజకీయ వ్యవస్థ అవసరమే. సమాజాన్ని ఒక నిర్దిష్టమైన పద్ధతిలో నడిపించడానికి ఒక ఆరోగ్యకరమైన రాజకీయ వ్యవస్థ ఉండాలి. ప్రపంచ వ్యాప్తంగా గణ వ్యవస్థలు పోయి రాచరిక వ్యవస్థ ఏర్పడినాక అది అసమ వ్యవస్థనీ పాలిస్తూ వచ్చింది. ప్రపంచ దేశాల సాహిత్యము దానినే ప్రతిబింబిస్తూ వచ్చింది. భారతదేశంలో మొదట సామ్రాజ్య వ్యవస్థ, తర్వాత ప్రాంతీయ, రాజ్యవ్యవస్థ భూస్వామ్య అసమ వ్యవస్థనే పాలించాయి. ఆ యుగాల సాహిత్యం ఆ వ్యవస్థనే కీర్తించింది. వలస పాలన ఫ్యూడల్ వ్యవస్థ వేళ్ళను పెకిలించకుండానే దానికి పెట్టుబడి దారీ వ్యవస్థతో అంటుగట్టింది. వలస పాలన ముగిసిన తర్వాత భారతదేశం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని ఎన్నుకుంది. ఆరున్నర దశాబ్దాలుగా భారతదేశం ఎన్నికల రాజకీయాలు నడుపుతున్నా, అప్పుడప్పుడు ఎన్నికలలో కొన్ని అద్భుతాలు జరుగుతున్నా ప్రజాస్వామ్య పదానికున్న విస్తృతార్థం ఇంకా జీర్ణం కాలేదు. కొంత మినహాయింపుతో ఆంగ్లేయులు వదిలిపోయిన భూస్వామ్య పెట్టుబడిదారీ సంకర రాజకీయమే కొనసాగుతున్నది. రాజకీయ పార్టీలు, ఎన్నికలు, గెలుపులు, ఓటములు కనిపిస్తున్నాయి. గనక ఇది ప్రజాస్వామ్యమనుకుంటున్నాం. ప్రజాస్వామ్యానికున్న విస్తృతార్థం మనకింకా జీర్ణంకాలేదనీ సత్యాన్ని నన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి తన రాజకీయ కథలలో ఆవిష్కరించాడు. పాలెగాళ్ళ, ఫాక్షనిస్టుల ప్రాంతమైన రాయలసీమ కేంద్రంగా ఆయన కథలు రాశాడు. ఆయనకు ఏ రాజకీయ పార్టీతోను అనుబంధం లేదు గాని, వర్తమాన రాజకీయ వ్యవస్థ ఎలా ఉంది? అలా ఉండడానికి కారణాలేమిటి? అనేది మాత్రం ఆయనకు బాగా తెలుసు.

రాయలసీమ ప్రాంతం పరిధిగా నన్నపురెడ్డి పునాది (1998), ఎంతెంత దూరం? (2004) బురద (2009), వాళ్ళు మాపార్టీకాదు (1996) కొక్కొరొకో (1996) వంటి కథలు రాశాడు. ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్య దేశంగా ప్రచారం పొందుతున్న భారతదేశంలో ఇంకా కొనసాగుతున్న ఆధిపత్యదురాచారం, అపరిపక్వ రాజకీయాలు, ఈ కథలలో చిత్రించాడు. ఈ కథలలో ఆణిముత్యం పునాది. పల్లెలతో నిండిన భారతదేశానికి పునాది, దానికి రాజకీయా రూపం పంచాయతీ. పంచాయతీ రాజ్య వ్యవస్థ ఎంత బలంగా ఆరోగ్యకరంగా ఉంటే దేశం అంతగా అభివృద్ధి చెందుతుందని అందరూ అనుకునేది, అందరూ చెప్పేది. ఈ గ్రామ స్వరాజ్యం అయిదు దశాబ్దాల స్వాతంత్ర్యం తర్వాత కూడా ఎలా ఉన్నదీ అంటే 'పునాది' కథలాగా ఉంది. ప్రజాస్వామ్యం ఒంట బట్టని రామిరెడ్డి వంటి గ్రామ పంచాయతీ ప్రెసిడెంట్లు పునాదిలోనే ప్రజాస్వామ్యాన్ని ఎలా కుళ్ళగించి వేస్తున్నారో ఈ కథ వివరిస్తుంది. పునాదిలోనే స్వార్థం, అవినీతి ఉన్నాయి గనక దానిపై నుండే అన్నీ వ్యవస్థలలోనూ అవే రాజ్యమేలుతున్నాయని ఈ కథ ప్రతిపాదించింది. గ్రామంలోని రైతులు కష్టపడి పండించుకున్న పంటను అడవిపందులు నాశనం చేసి, వాళ్ళకు రాత్రింబవళ్ళు కంటి

మీద కునుకులేకుండా చేస్తుంటాయి. ఊరి ప్రెసిడెంటు ఈ సమస్యకు పరిష్కారం చూపకపోగా ప్రజలకే సమస్యలు సృష్టించాడు. ఒకసారి పెంపుడు పందులు ఊళ్ళోకి వచ్చిపడినాయి. రైతులు అవి అడవిపందులనుకొని వాటిని తరిమి కొన్నిటిని చంపారు. ప్రెసిడెంటు దానిని చూచి బయటికి వెళ్ళిపోయి ఆ పందుల యజమానులను ఊళ్ళోకి వచ్చి గొడవ చెయ్యమని సూచించి తిరిగి వచ్చాడు. పందుల వాళ్ళు ఊళ్ళోకి వచ్చి గొడవ చేసి కేసు పెడతామని బెదిరించారు. రైతులు భయపడిపోయి ప్రెసిడెంటును ఆశ్రయించారు. ప్రెసిడెంటు కొడుకును పంపించి పందుల వాళ్ళను బెదిరించి పంపించేశాడు. కోసిన పంది కూరలో ఎక్కువగా ప్రెసిడెంటు ఇంటికే చేరింది. ఇది దేశ పునాది అయిన పంచాయతీకి నాయకుడైన ప్రెసిడెంటు రాజకీయం. అదీ యాభయేళ్ళ స్వతంత్రం తర్వాత. ఇది తలకిందులు రాజకీయం. ఈ కథలో ప్రజలకు ప్రెసిడెంటు రాజకీయ అర్థం కావడమే పునాది. ఈ ప్రజలకు ఎరుకలు కూడా తమ ప్రతిబింబాలే అని తెలియడం ఈ కథలోని మరో విశేషం. ఈ యిద్దరికీ తాను అర్థమయ్యానని ప్రెసిడెంటుకు తెలియడానికిమరికొంతకాలం పడుతుందని కథను ముగించడం సరైన ముగింపు.

విద్యావ్యవస్థకు రాజకీయ వ్యవస్థకు మధ్య ఆరోగ్యకరమైన సంబంధమున్న సమాజం బాగుపడుతుంది. విద్యా వ్యవస్థ గౌరవింపబడే సమాజం ఆరోగ్యకరంగా ఉంటుంది. ప్రజాస్వామ్యం జీర్ణం కాని వ్యవస్థలో విద్యావ్యవస్థకు కూడా గౌరవం దక్కదు. గ్రామస్థాయిలో విద్యా వ్యవస్థను సంరక్షించాల్సింది పంచాయితీ ప్రెసిడెంటు. ఆ ప్రెసిడెంటు ఆధిపత్యవాది అనాగరికుడు అయితే ఎలా ఉంటుందో 'ఎంతెంత దూరం?' కథ తెలియజేస్తుంది. పాఠశాలలో ఉపాధ్యాయుని పాత్ర కీలకమైనది. సమాజానికి అవసరమైన పౌరులను ఉత్పత్తి చేసేది పాఠశాల. దానికి కీలువంటి వాళ్ళు ఉపాధ్యాయులు, వాళ్ళపట్ల గ్రామ పంచాయితీ ప్రెసిడెంటు గౌరవం కలిగి ఉండాలి. వినయం కలిగి ఉండాలి. అయితే ప్రజాస్వామ్యం జీర్ణం కాని భారత రాజకీయానికి ఉపాధ్యాయులు కేవలం ఉద్యోగులుగానే కనిపిస్తున్నారు. పంచాయతీ స్థాయిలో అయితే ప్రెసిడెంటులు వాళ్ళను బానిసలుగా చూస్తున్నారు. ఈ కథలో ఉపాధ్యాయుడు రోజూ బడికి పోతున్నా, ఏనాడూ బడికి వెళ్ళని ప్రెసిడెంటు, అతడు బడికి రావడం లేదని ఫిర్యాదు చేస్తాడు. ప్రెసిడెంట్ దృష్టిలో ఉపాధ్యాయుడు బడికి రావడమంటే ఉదయాన్నే తనను దర్శించుకోవడమే. మండల విద్యాధికారి సూచించే ఉపాధ్యాయుడు ప్రెసిడెంటును చూడడానికిపోతే ఇంట్లో ఉండీ లేదని చెప్పిస్తాడు. రెండోరోజు వెళితే రేపు రమ్మంటాడు. మూడోరోజు పోతే, తన కుర్చీ తప్ప ఎదురుగా వచ్చిన వాళ్ళకు కూర్చోడానికి ఏవీ కనిపించదు. ఈ ఉపాధ్యాయుడు దానిని గమనించి అతన్ని కలుసుకోకుండానే విద్యార్థుల్ని బడికి పిల్చుకొనిపోతాడు. సభ్య సంస్కారాలు లేని రాజకీయ ప్రతినిధుల వల్ల సమాజం ఎలా గిడసబారి పోతుందో ఈ కథ చెబుతుంది. స్వయంగా పాఠశాల అధ్యాపకుడైన నన్నపురెడ్డి స్వానుభవంతోనే ఈ కథ రాసి ఉంటాడు.

"అభివృద్ధికి నోచుకోకుండా అన్ని రంగాలలో రాయలసీమ ఎందుకు వెనకబడి ఉందో నాకిప్పుడు అర్థమవుతోంది" అని ముగిస్తాడు నన్నపరెడ్డి "వాళ్ళు మాపార్టీ కాదు' కథను. ఎన్నికలప్పుడు ఉండవలసిన రాజకీయ స్పర్ధలు సమాజంలోని అన్ని సందర్భాలకు విస్తరించి ప్రజాసమస్యలు పరిష్కారం కాకుండా అడ్డుపడుతున్న వాస్తవాన్ని ఈ కథ ఆవిష్కరించింది. ఉమ్మడి సమస్యలను ఉమ్మడిగా పరిష్కరించుకోవాలనే జ్ఞానం లేకుండా ఎవరికి వాళ్ళుగా ఉద్యమాలు నడిపే రోగం ఇటీవల ముదిరి పోయింది. ఫలితం సమస్యలు సమస్యలు గానే మిగిలిపోవటం. అందరికీ ఆధారమైన నీటి దగ్గర కూడా పార్టీ రాజకీయాలను దూర్చే అనాగరికతను ఈ కథ చిత్రించింది. కథకుడు రచయిత. కరువు మీద కథ రాసుకొని ఆకాశవాణిలో చదవడానికి బయలు దేరుతుంటే అతని మిత్రుడు ప్రభాకర్ కనిపించి కరెంటు కోత, కరువు సమస్యల మీద బంద్ చేస్తున్నామని చెబుతాడు. దారిపొడుగునా రైతుల ఆందోళనలు జరుగుతుంటే కథకుడు కరిగిపోతాడు. కడప నుంచి తిరిగివస్తూ ఒక టీ అంగడి దగ్గర ఆగి టీ తాగుతాడు. అక్కడ ఒక బోరు బావి ఉంటే, కొందరు సైకిళ్ళకు బిందెలు కట్టుకొని నీళ్ళ కోసం దూరంగా పోతుంటారు. అదే మని అడిగితే వాళ్ళు మా పార్టీ కాదు' అని టీ అంగడయ్య చెబుతాడు. ఊళ్ళోకి వెళ్ళగానే ప్రభాకర్ కనిపిస్తాడు. బంద్‌కు రాష్ట్ర నాయకుల్ని పిలవాలని, దాని కోసం ఫండ్ వసూలు చెయ్యాలని, బంద్ జరిగేదాకా వాన రాకుండా ఉండాలని, కరువుంటేనే గదా బందుకు విలువ అని మాట్లాడతాడు. అప్పుడు కథకునికి రాయాలసీమ వెనుకబాటు తనానికికారణం అర్థమౌతుంది.




చెరువుముంపు వల్ల భూముల్ని పోగొట్టుకొని కూలీలుగా మారిన చిన్న రైతులు నష్టపరిహారం పొందడానికి ఊరిపెత్తందారికి, అధికారులకు పరాయోళ్ళకోళ్ళు దొంగిలించి నజరానా ఇచ్చుకోవలసిన ప్రజల దుస్థితిని 'కొక్కొరొకో' కథ ప్రతిబింబించింది. ఆ ప్రయత్నంగా సహజంగా దక్కవలసిన న్యాయం, బూటకపు ప్రజాస్వామ్యంలో అధికారుల, స్థానిక పెత్తందారుల అవినీతికి బలైపోవడాన్ని ఈ కథ వాస్తవికంగా చిత్రించింది. ప్రజల వద్దకు పాలన కాలంలో అస్తవ్యస్తమైన రాజకీయ విధానాలతో ప్రజల్ని కరెంటు దొంగలుగా చిత్రించి

# అక్షరయుద్ధమెప్పుడూ అనివార్యమే...!

- కెంగారమోహన్
9493375447




నీకోసం ఎన్నో లక్షల అక్షరాల
వరుసలు పేర్చి జీవం పోశాను.
ఆపాదమస్తకం ఆవరించిన చైతన్యంతో
సమసమాజాన్ని నిర్మించాలనుకున్నాను.
ఎన్నో కలల్ని కాలంలో ధారపోశాను.
ఆలోచనలన్నింటిని గుణించి,
ఆశల గూళ్ళు కట్టాను.
ఆశయాల్ని వక్రమార్గంలో నడిపిస్తున్న
అంతర్లీనం ముఖం మీద ఉమ్మేయాలనిపించేది.
విలువలపై ఇప్పుడు జరుగుతున్న సామూహిక
అత్యాచారానికి మథన పడడం,
ప్రయోజనం లేదనిపిస్తుంది.
వొకడుగు ముందుకు వందడుగులు వెనక్కి
తిరోగమన దిశలో పరిభ్రమిస్తున్న
సమాజాన్ని ప్రశ్నించాలనివుంది.
లోపలున్నవాడికి బయటున్న వాడికి
ఏమాత్రమూ పొంతన లేదు.
ఇద్దరివి వేర్వేరు దారులే.
మది పంపే సంకేతాలకు
బరువవ్వడమో, తేలికవ్వడమో
భ్రాంతి మాత్రమే.
హృదయ సాగరంలో ప్రళయం సృష్టిస్తున్న
కన్నీటి చుక్క మాత్రం ఇక్కడ చాలా బరువైనదే.
సంఘర్షణలెన్ని చుట్టు ముట్టినా, నిష్క్రమించడం
సైద్ధాంతిక విరుద్ధమే.
అందుకే అక్షరయుద్ధమెప్పుడూ అనివార్యమే.

---



జైళ్ళలోకి నెట్టిన దుర్మార్గ రాజకీయం మీద 'ఏడోకడ్డీ' అనే కథా (1996) నిరసన, ఏడో కడ్డీ అంటే రాజకీయమే.

నన్నపురెడ్డి గ్రామీణ రాజకీయ పరిజ్ఞానానికి మరొక కథ చక్కని ఉదాహరణ. అది 'బురద'. ఈ కథలో బురద ప్రతీక. అస్తవ్యస్త రాజకీయానికి ప్రతీక. అరు దశాబ్దాల స్వతంత్ర చరిత్ర గడిచి పోయినా ఒక న్యాయమైన జీవితం ప్రజలకు ఇవ్వలేకవపోడం బురద. సంపన్నుల ప్రయోజనాలకు సామాన్యుల జీవితాలు ఆట వస్తువులు కావడం బురద. ఈ బురదను నన్నపరెడ్డి ఈ కథలో ప్రదర్శించాడు. గ్రామాల్లో గొల్లలు గొర్రెలు, మేకలు పెట్టుకొని మంద తోలుకుని బతుకుతూ ఉంటారు. మందను మేపుకు తోలుకు వెళ్ళినప్పుడు ఎవరి పైరునైనా జీవాలు మేసేస్తే, పరిహారంగా కొన్ని రోజులు మంద తోలి సరిపెట్టుకునేవారు. ఒక్కోసారి కోపిష్టి రైతులు తిట్టేవారు, కొట్టేవారు కూడా. గ్రామాలు మారాయి. ప్రతీదీ రాజకీయమే. రాజకీయాలు కులం రంగుపూసుకుంటున్నాయి. ఒకపార్టీ ఒక కులాన్ని చంక ఎత్తుకుంటే ఇంకో పార్టీ ఇంకో కులాన్ని, ఈ రెండు కులాలు శత్రు శిబిరాలౌతాయి. రాయలసీమలో అది వరకే ఉన్న ఫ్యాక్షనిజానికి ఈ కుల రాజకీయం తోడైంది. బురద కథ దానినే చిత్రించింది. గంగయ్య జీవాలు కొండ దిగి వస్తూ సుబ్బారెడ్డి పత్తి చేను మేశాయి. పంచాయతీకి వచ్చింది. ఆ ఊళ్ళో ప్రతాపరెడ్డి పెత్తందారు. పక్కూరి పెత్తందారు వీరా రెడ్డి ప్రతాపరెడ్డి ని ఎదుర్కోడానికి వీరా రెడ్డి ఆఊళ్ళో రాఘవను చేర దీశాడు. పంచాయతీకి రమ్మని గంగయ్యకు కబురెళ్ళింది. గంగయ్య ఇలాంటి తగాదాలు గతంలో పరిష్కారమయ్యే తీరునూ, ఇప్పటి రాజకీయాలను ఆలోచిస్తూ పంచాయతీకి వెళ్ళాడు. అక్కడ ఇరవై వేల రూపాయలు పరిహారం కట్టించమన్నారు. గంగయ్య ఇది విని భయపడిపోయి పంచాయతీకి పోలేదు. నేరుగా సుబ్బారెడ్డి దగ్గరికి వెళ్ళాడు. 'అట్టొకడు యిట్టొకడు సిమెంటు రోడ్లా బలిసి ఇండ్లన్నీ బురద జేస్తాండారు నా కొడుకులు.. కాపనాకొడు కొకడు.. గొల్లనాకొడుకొకడు' అని విమర్శిస్తూ సుబ్బా రెడ్డిని, ఏకాంతంలో కలిశాడు. జరిగిన నష్టానికి పదహారు రోజులు మంద తోలేట్టు మాట్లాడుకున్నాడు. ఇది రెండు వైపులా ముఠా నాయకులకు గాలి తీసివేసినట్లైంది. చాలా సహజంగా ఇద్దరు వ్యక్తుల మధ్య జరగవలసిన సర్దుబాటు ముఠా రాజకీయ నాయకుల స్వార్థంలో పదిమంది సమస్యగా మారిపోయే ప్రమాదం ఏర్పడింది. దీనిపై విమర్శ ఈకథ. మనుషులు సాంస్కృతికంగా ఎదగకుండా భౌతికంగా వేసే రోడ్ల వల్ల ప్రజల జీవితంలో మిగిలేది బురదే నని ఈ కథ ప్రతిపాదిస్తుంది.

సాహిత్యం సామాజిక వాస్తవికతను విశ్లేషించి పాఠకులలో ఆలోచనలు రేకెత్తించడం కర్తవ్యంగా భావిస్తే నన్నపురెడ్డి రాజకీయ కథలు ఆ పనిని బాగా నెరవేరుస్తాయి.

# అయ్యో! చిల్లర దుకాణం...?

చైతన్య ప్రసాద్
9849651451

చింతపండు పట్రమ్మని అమ్మ చిల్లర కొట్టుకు పంపిస్తే...
షావుకారికి పావలా ఇచ్చి, చూస్తూ నిలబడేవాణ్ని !
చింతపండు కాగితంలో చుట్టిస్తూ, చిన్న బెల్లంముక్క తాయిలం పెడితే...
కృతజ్ఞతగా కళ్ళుటపటప లాడించి, తుర్రుమనేవాణ్ని!
వస్తూ – దార్లో ఓ క్షణమాగి, పొట్లంలోంచి చిన్న చింతపండు గిల్లి
దాన్నీ, బెల్లాన్నీ కలిపి బుగ్గన దాచేసేవాణ్ని – ఎవరూ చూడకుండా !
'థాంక్స్ రా బుజ్జీ' అని అమ్మ మెచ్చుకుంటే.. 'ఊఁ'! అనే వాణ్ని నోరు తెరవకుండా...
అయినా అమ్మా పసిగట్టేసేది – 'నోట్లో ఏమిట్రా అది?' అని అడక్కముందే
'బెల్లం ముక్క – ఊరికే ఇచ్చాడు' అంటూనే కరకరా నమిలి మింగేస్తుంటే...
అమ్మ నవ్వుతూ వంటింట్లో కెళ్ళాక, 'హమ్మయ్య' అనుకునేవాణ్ని !
గత దసరా శలవులకు ఇంటి కెళ్ళినపుడు చూశా...
ఆ చిల్లర కొట్టు ఎత్తేశాడట – మెయిన్ రోడ్డు మీద పెట్టిన 'రిలయన్స్' దెబ్బకు !
ఆ షావుకారు ఇంటింటా పాల పేకెట్లు వేసుకుంటుంటే...
వాళ్ళమ్మాయి 'రిలయన్స్'లో పన్నెండు గంటల పనికి కుదిరిందట!
మా వీధిలో చాలా చిల్లర కొట్లు అలానే మూతపడ్డాయి.
భవిష్యత్తులో 'చిల్లర దుకాణా'లంటే తెలియవు కాబోలు !
మళ్ళీ మొన్న దసరా శలవుల కెళ్ళినపుడు గమనించా...
వాల్ మార్ట్ 'బెస్ట్ ప్రైస్' హంగామా ! 'మన టౌను కూడా ఫర్వాలేదే' అనుకున్నా !
పండుగ సరుకులకని – రిలయెన్స్ కెళ్ళా... బావురుమంది !
ఆఫర్లు లేవు – ట్రాలీలు తుప్పు పట్టాయి – రేక్‌లు ఖాళీగా ఉన్నాయి !
ఏ.సి., – ఓన్లీ ఫర్ ఎన్.వి. కౌంటర్ – స్టాఫ్‌ని వెతుక్కోవలసి వచ్చింది
సెక్యూరిటీనడిగా 'వాల్‌మార్ట్ తిమింగలం అందర్నీ మింగేస్తోంది' అన్నాడు
నాకాశ్చర్యం వేసింది... అప్పుడు చిల్లర కొట్లు, ఇప్పుడు 'మాల్స్' మూత !
రైతులకు సబ్సిడీలు లేవు సరికదా – పక్క పల్లెటూళ్ళలో పండిన పంటలన్నీ
అయిన కాడికి కమ్ముడయ్యి, వాల్ మార్ట్‌కు చేరుతున్నాయట – లాభాల కోసం !
అవునూ... మన దేశంలో ఉప్పు, పప్పు, బెల్లం, చింతపండూ అమ్మడానికి
అమెరికా నుండి వాల్ మార్ట్ రావాలా? మనం దుకాణాలు మూసుకోవాలా?
మన చిల్లర దుకాణాల్ని మింగేసి, రైతుల్నీ, ప్రజల్నీ నిలువునా దోచేసిన సొమ్ము–
ఏ రోజు కారోజు తమ దేశానికి జమ చేసుకుంటుంటే... మనం చూస్తూ ఉండాలా?
'ఈస్టిండియా కంపెనీ వ్యాపారం' గుర్తు కొచ్చి – పిడికిళ్ళు బిగుసుకున్నాయ్ !
'దేశి సరుకులు నింపవోయ్!' అని గురజాడ అంటే....
'విదేశీ సరుకులు కొంపకేయ్!' అనే గులాంగిరీ 'నల్ల దొరల్ని'
వీధిలో జెండా కర్రకు కట్టి, 'ప్రజా తీర్పు' చెప్పించాలంటే...
దేశ స్వావలంబన కాపాడుకుంటూ, సామ్రాజ్యవాదుల దోపిడీ నెదిరించాలంటే...
'గాంధీల' బోసినోళ్ళు' ఇప్పుడు పనికి రావు – ఆయన 'చేతి కర్ర' కావాలి !
'అల్లూరి' వారసులు లేచి, వెల్లువలా ఘర్జించాలి !
వాళ్ళతో మనమంతా చేయి చేయి కలపాలి !!



# ఎల్లి నవల - గిరిజన స్త్రీ జీవితం

- డా॥ వై. సుభాషిణి
9000102394




తరాలు గడిచినా మారని స్త్రీల బతుకుల వెతల కన్నీళ్ళు 'ఎల్లి' నవల. ఇంట్లో వాళ్ళేకాక సమాజంలో ఎదురయ్యే లైంగిక శారీరక దోపిడీతో అతలాకుతలం అవుతున్న స్త్రీల జీవితాలను చాటుతుంది ఈ నవల. గిరిజన స్త్రీలలోని ఓలి అనే దురాచారాన్ని ఖండించే రచన ఇది. వారిలో ఉన్న ఈ ఓలి అనే దురాచారం స్త్రీలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఎలా కుంగదీస్తూ ఉందో చెప్పే నవల 'ఎల్లి' /

సాంఘిక జీవనానికి ప్రతిఫలనమైన సాహిత్యంలో ప్రత్యేకించి గిరిజన జీవితంలో స్త్రీల స్థితిగతులేమిటి? వారు సంఘంలో ఎలాంటి గుర్తింపునకు పాత్రమయ్యారు? అని చర్చించడమే ఈ వ్యాస ఉద్దేశ్యం. 'యథార్థ జీవితాన్ని యథార్థ దృష్టితో అధ్యయనం చేసి, దానిని గద్యరూపంలో వ్యక్తం చేసేదే నవల' - రిచర్డ్ క్రాస్. 'నవల అన్నది కేవలం గద్యాత్మకమైన కాల్పనిక కథ కాదు. అది మానవుడి జీవితాన్ని గురించి, పరిపూర్ణ మానవ చేష్టలను గురించి గద్యరూపంలో చెప్పబడిన వ్యాఖ్యానం' -రాల్ఫ్ ఫాక్స్

తరాలు గడిచినా మారని స్త్రీల బతుకుల వెతల కన్నీళ్ళు 'ఎల్లి' నవల. ఇంట్లో వాళ్ళేకాక సమాజంలో ఎదురయ్యే లైంగిక శారీరక దోపిడీతో అతలాకుతలం అవుతున్న స్త్రీల జీవితాలను చాటుతుంది ఈ నవల. గిరిజన స్త్రీలలోని ఓలి అనే దురాచారాన్ని ఖండించే రచన ఇది. వారిలో ఉన్న ఈ ఓలి అనే దురాచారం స్త్రీలను ప్రత్యక్షంగాను, పరోక్షంగాను ఎలా కుంగదీస్తూ ఉందో చెప్పే నవల 'ఎల్లి' /

**నవలలో స్త్రీ జీవితం - వివిధ ప్రధానాంశాలు :**

**స్త్రీవాద దృక్పథం :** స్త్రీలు తమ స్వీయ అస్తిత్వాన్ని నిరూపించుకోవాలని ఆరాటపడుతూ, తరతరాలుగా జరుగుతూ వచ్చిన అన్యాయం పట్ల న్యాయమైన క్రోధంతో ఆత్మాశ్రయ కోణం నుంచి ఆ క్రోధాన్ని వెళ్ళగక్కిన క్రమంలో స్త్రీవాద సాహిత్యం వెలువడింది. సమాజం స్త్రీకిచ్చిన స్థానాన్ని బట్టే ఒక జాతి అభివృద్ధి నిర్ణయించబడుతుంది. సమాజంలోని స్త్రీల స్థితిగతుల్ని బట్టే జాతి సంస్కృతిలోని ఔన్నత్యాన్ని, ఆంతర్యాన్ని, పూర్వాపరాలను అంచనా వేయవచ్చు. స్త్రీ, పురుషుడితో పాటు సమాన ప్రతిపత్తినిచ్చి గౌరవింపబడిందా? లేక ఉదాసీనతకు గురైందా? అనే దాని మీద సంఘ విలువల్ని లెక్కగట్టవచ్చు. స్త్రీ పురుషులిద్దరూ సమాన అవకాశాలు పొందగల్గినప్పుడు మాత్రమే దేశం అభివృద్ధి చెందినట్లుగా భావించవచ్చు.

స్వాతంత్ర్యానంతరం తెలుగు సాహిత్యంలో వచ్చిన వాదాల్లో స్త్రీవాదం ఒకటి. ఇది సాహిత్యంలోను, సమాజంలోనూ తెచ్చిన మార్పు అనన్యమైంది. స్త్రీవాదం అనే భావన ఎప్పటినుండో ఉన్నప్పటికీ అది ఒక వాదంగా, ఉద్యమంగా గుర్తింపు పొందింది మాత్రం 1980 దశకం తర్వాతే. ఐక్య రాజ్య సమితి 1975 నుండి 1985 వరకు అంతర్జాతీయ మహిళా దశాబ్దిగా గుర్తించడం, స్త్రీ సమస్యలనూ, సమాజంలో స్త్రీల స్థితిగతులనూ విభిన్న దృష్టికోణాల నుంచి అధ్యయనం చెయ్యడానికి దోహదం చేసింది. ఎందరో రచయితలు, రచయిత్రులు స్త్రీల చైతన్యాన్ని ప్రభావితం చేసే రచనలు చేశారు. చేస్తూన్నారు. స్త్రీల జీవితాల్లోని అనుభవాన్ని, అనుభూతినీ నిస్సంకోచంగా తమ రచనల్లో ఆవిష్కరించారు. ఇటీవలి స్త్రీవాద రచనలు కూడా స్త్రీలను చైతన్యవంతం చేసే దిశలోనే ఉన్నాయని చెప్పవచ్చు. అందులో ఒకటి గిరిజన స్త్రీల చైతన్యాన్ని వస్తువుగా తీసుకొని అరుణ రచించిన 'ఎల్లి' నవల. ఇది గిరిజన కులాచారమైన ఓలి సమస్య చుట్టూ నడిచిన కథ. 'ఓలి' తీసుకొని వయస్సులో చాలా చిన్నపిల్లలకు వివాహాలు చేయడం, వాటి పరిణామాలు మాండలిక భాషలో ప్రభావవంతంగా ఈ నవలలో అరుణ చిత్రించారు.

**వివాహ వ్యవస్థ :** స్త్రీ జీవితంలో వివాహమనేది ఒక ప్రధాన ఘట్టం. వివాహం విషయంలో స్త్రీ పురుషుణ్ణి ఎన్నుకునే స్వేచ్ఛ గిరిజన స్త్రీలలో కన్పించదు.

ఓలి కోసం కన్నతండ్రియైన ఎంకన్న పెళ్ళి వయసు కూడా రాని ఎల్లిని వయసు ఎక్కువైన వాడికిచ్చి పెళ్ళి చేస్తాడు. అందరూ సరిజోడు కాదంటున్నారని తన భర్తతో చెప్పిన దురగను స్త్రీలకు ఒక అభిప్రాయం ఉండటమే నేరమని, "నీ యిష్టం ఎవుడడిగాడే వాళ్ళేం పులపులమంటుందా" (పుట : 20) అంటాడు ఎంకన్న. గిరిజన స్త్రీల

మనోభావాల్నీ, అభిప్రాయాల్నీ అణచివేస్తున్నారు. స్త్రీ ఇష్టాయిష్టాలతో పనిలేకుండా పురుషులే నిర్ణయాలూ తీసుకోవటం ఇక్కడ ఉంది. ఇది పురుషుని ఆధిపత్యాన్ని నొక్కి చెప్పేదిగానే ఉంది.

**పితృస్వామ్యం :** ఇది కుటుంబంలో స్త్రీ స్థానాన్ని పురుషుడు స్వాధీనం చేసుకున్న దశ. పురుషుడే కుటుంబానికి యజమానిగా ఉంటూ, అన్నిటినీ నియంత్రిస్తూ ఉండటం పితృస్వామ్య లక్షణం. ఈ పురుష యజమాని ద్వారానే కుటుంబ సభ్యులందరూ సమాజంలో గుర్తింపు పొందుతూ ఉంటారు. ఈ దశలో పురుషుడికి స్త్రీల శ్రమను, లైంగికత్వాన్ని, సంతానోత్పత్తి శక్తినీ నియంత్రించడానికి అవకాశం ఏర్పడింది. దీంతో పురుషుడికి స్త్రీ మీద, ఆస్తి మీద ఆధిక్యత, అధికారం ఏర్పడ్డాయి. ఈ వ్యవస్థ గిరిజన స్త్రీల విషయంలో కూడా ప్రస్ఫుటంగా కన్పిస్తుంది.

ఇంట్లో తండ్రి ఇష్టానుసారం వివాహం చేసుకొని అత్తగారింట్లో మొగుడు, అత్తమామలు పెట్టే ఇబ్బందులను, దెబ్బలను తట్టుకోలేక పుట్టింటికి తిరిగి వచ్చేస్తుంది ఎల్లి. తీసుకున్న ఓలి ఇచ్చుకోలేక కూతురిని తిరిగి అత్తగారింటికే పంపించాలనుకుంటాడు తండ్రి. మాలచ్చిమి ఇద్దరు బిడ్డల తల్లి అయినప్పటికీ డబ్బు కోసం కట్టుకున్న భర్తే మరో వ్యక్తికి అమ్మేస్తాడు. ఆమె నేనెళ్ళనని తిరగబడినందుకు కళ్ళుపొడిచి మరీ పంపేస్తాడు.

తాగిన వైకంలో తన భార్యను అమ్మేస్తాడు బిచ్చాలు. ఆమె ప్రమేయం లేకుండా డబ్బుకోసం పారోతిని అమ్మటం, ఆమె నా పిల్లల గతి ఏం కావాలి? నన్ను అమ్మడానికి నీకెలా మనసొప్పింది? అని అడిగితే నోర్ముయ్ అని భార్యను గద్దించి, పురుషాహంకారం చాటుకుంటాడు.

**ఇంటి చాకిరి :** భర్తలు తాగి తందనాలాడుతుంటే స్త్రీలు అన్ని పనులు చూసుకోవాలంటారు పురుషులు. ఎల్లి నవలలో కూడా స్త్రీలు తమ భర్తలు ఇంటిపని చేయకపోయినా పనంతా వారే చేసుకొంటారు. ఎల్లి అత్తమామలు చచ్చేటట్లు ఎల్లితో పనిచేయిస్తారు. ఎంత పనిచేసినా ఒక బుట్ట అల్లడం సరిగా రాదని సతాయిస్తారు. దీన్ని మొక్కల్లో తుంచకపోతే మానైనాక వంగుతుందా అని చావచితకదంతారు. ఏదైనా నోరు తెరిచి మాట్లాడితే పెళ్ళాం అంటే నోరు తెరిచి మాట్లాడగూడదంటారు. ఇంటి పనికి సరైన విలువ, గుర్తింపు లేక కుమిలిపోవడం ఎల్లి వంతైంది.

**మాతృత్వం :** పిల్లలకి జన్మనివ్వటంతో పాటు వారి పోషణ, శిక్షణ అన్నీ మాతృత్వంలో భాగంగా గుర్తింపు పొందాయి. మానవ ఉత్పత్తి లేనిదే వస్తూత్పత్తి లేదు. దీనికి కారణం స్త్రీ పునరుత్పత్తి శక్తి కనుక మాతృత్వాన్ని కూడా రాజకీయ ఆర్థిక అంశంగా స్త్రీవాదులు గుర్తించాలంటారు. దీనిలో భాగంగా పిల్లల పెంపకంలో సమాన భాగస్వామ్యం ఉండాలని కోరతారు. పిల్లల విషయంలో నిర్ణయించుకునే హక్కు స్త్రీకే ఉండాలని చెబుతారు.

ఎల్లి నవలలో గిరిజన స్త్రీలకి స్వేచ్ఛ అసలు లేదు. పిల్లల్ని కన్న తర్వాత భార్యను మరొకడికి అమ్మేస్తారు. కన్నబిడ్డలని తీసికెళ్ళే స్వేచ్ఛ కూడా ఉండదు. మాలచ్చిమి మొదటి భర్తకు ఇద్దరు ఆడపిల్లలు పుడతారు. తరువాత మాలచ్చిమిని అమ్మేస్తాడు. తన బిడ్డలను ఇవ్వమంటే ఇవ్వడు. ఆడపిల్లలు ఓలి తీసుకొస్తారనే ఉద్దేశ్యంతో ఆమె భర్త పిల్లలను ఇవ్వకుండానే మాలచ్చిమిని పంపేస్తాడు. పిల్లల మీద తనకి ఎలాంటి స్వేచ్ఛ లేకుండా వారిని తల్లిలేని పిల్లలని చేస్తాడు. ఈ నవలలో ఇది మరో పార్శ్వం.

**లైంగిక దోపిడి :** హింసా సంస్కృతి పెచ్చు పెరిగిన సమాజంలో ముందుగా దోపిడికి గురవుతున్నది స్త్రీలే. స్త్రీ మీద లైంగికదోపిడి నిరంతరం జరుగుతోంది. ఇది కుటుంబం లోపలి వ్యవహారంగా పరిగణించినంత వరకూ దీన్ని సమస్యగా గుర్తించలేదు. దీన్ని సామాజిక సమస్యగా, స్త్రీ వ్యక్తిత్వం మీద జరిగే దాడిగా పరిగణించారు.

ఎల్లి నవలలో బాజి అనే గిరిజన స్త్రీపై జరిగిన లైంగికదోపిడీకి ఒక అకృత్యం. ఊళ్ళో అగ్రవర్ణాల వాళ్ళ లైంగికదోపిడీకి గురైె బాజి తన సంసారంలో ఇమడలేక మగడంటేనే భయపడి పిచ్చిదై చనిపోవడం మగవాళ్ళ దౌష్ట్యాన్ని చాటుతుంది. "గిరిజన జీవితాలలో దోపిడి ఒక భాగం. వారి అమాయకత్వం, నిష్కల్మషత్వం నాగరికులకు అవకాశం కల్పిస్తుంది. ఆ నిష్కాపట్యాన్ని ఆధారం చేసికొని, చేసే దోపిడీకి పార్శ్వాలు అనంతం. ఇది ఎంత ఎక్కువంటే, దోపిడీకి గురికావడం అనేది కొన్ని తరాలుగా అలవాటు పడిన వారి జీవితంలో జీవనంలో సంస్కృతిలో అది భాగమై పోయిందన్నా ఆశ్చర్యం లేదు" అని డా. కొలకలూరి మధుజ్యోతి అన్నారు.

"మన సమాజంలో కొందరు తక్కువ కులాల్లో పుడతారు. అనేకమంది బీదల కడుపున పుడతారు. మరికొందరు ఆడవాళ్ళుగా పుడతారు" అనే కొడవటిగంటి కుటుంబరావు మాటల్లో, తక్కువ కులాల్లో పుట్టినవాళ్ళూ, బీదల కడపున పుట్టినవాళ్ళూ, ఆడవాళ్ళూ అంతిమంగా అణచివేయబడతారనే అర్థం ఉంది. ఈ విషయాన్ని ఈ నవల నిరూపిస్తుంది" ధనికుల నగ్న సత్యానికి సాక్షులు పీడిత ప్రజలు. మగవాళ్ళ నగ్న సత్యానికి సాక్షులు ఆడవాళ్ళు" అన్న కొడవటిగంటి కుటుంబరావు మాటలకు ఈ నవలలోని సంఘటనలు ప్రత్యక్ష నిదర్శనం.

తన శీలాన్ని బలిగొన్న అగ్రవర్ణాల కుర్రోళ్లను చూసిన బాజి వారి మీద ఉమ్మేస్తుంది. దాంతో వాళ్ళు బాజిని పట్టుకొని చితకబాదుతారు. బాజి ద్వారా తన ఆక్రోశాన్ని ఉమ్మితో వెళ్ళగక్కించింది రచయిత్రి. స్త్రీలను రకరకాల దుర్భర పరిస్థితుల్లోకి నెట్టి, వారు పడే కష్టాలను, బాధలను చూసి ఆనందిస్తుంది సమాజం. కుటుంబం నుంచి మొదలైన ఈ స్థితి సమాజంలో అనేక రూపాల్లో కనిపిస్తుంది. ఏ వృత్తిలో ఉన్న స్త్రీలైనా వారి పని వారే చూసుకొని తలవంచుకొని బయటికి రావాలన్నా అక్కడి పురుషుల చేత ఏదో ఒక రకమైన మాటలు పడక తప్పదు. అదే పరిస్థితి బాజికి ఎదురయ్యింది 'ఎల్లి' నవలలో.

**ఓలి :** వరకట్నం కోసం స్త్రీలని చంపుతున్న ప్రస్తుత సమాజంలో అదీ

**ఎల్లి నవలలో గిరిజన స్త్రీలకి స్వేచ్ఛ అసలు లేదు. పిల్లల్ని కన్న తర్వాత భార్యను మరొకడికి అమ్మేస్తారు. కన్నబిడ్డలని తీసికెళ్ళే స్వేచ్ఛ కూడా ఉండదు. మాలచ్చిమి మొదటి భర్తకు ఇద్దరు ఆడపిల్లలు పుడతారు. తరువాత మాలచ్చిమిని అమ్మేస్తాడు. తన బిడ్డలను ఇవ్వమంటే ఇవ్వడు. ఆడపిల్లలు ఓలి తీసుకొస్తారనే ఉద్దేశ్యంతో ఆమె భర్త పిల్లలను ఇవ్వకుండానే మాలచ్చిమిని పంపేస్తాడు.**

గిరిజన జీవితాలలో ఓలి అనేది ఒక ఆచారం. ఈ నవల అంతా ఓలి సమస్య చుట్టూ చుట్టుకొని ఉంది. ఓలి సమస్యను ఆసరాగా చేసుకొన్న దోపిడి ఎంతో ఎక్కువగా కనిపిస్తుంది. వీరిపై అగ్రకులస్థుల శారీరక లైంగిక దోపిడీ మరొక ఎత్తు.

ఈ సమాజంలో స్త్రీ తిరిగి వివాహమాడకూడదనే నియమం, విడాకుల హక్కు లేని కారణం, ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడం, స్త్రీల కన్నీటి గాథలకు హేతువులని వివరిస్తూ" ఆధునిక మహిళలు భారతదేశ చరిత్రను తిరిగి రచిస్తారు" అని గురజాడ ఆశించారు. అయితే ఎల్లి నవలలో గిరిజన స్త్రీలకు ఎరుకుల కులాచారమైన 'ఓలి' అనే దురాచారం ఉండడం వల్ల, కట్టుకున్న భర్తే, భార్యను మరో పురుషుడికి ఓలికోసం అమ్మేయడం కన్పిస్తుంది. ఓలి తీసుకొని పుట్టింటి వాళ్ళు ఒకడికి స్త్రీని అమ్మేస్తే కట్టుకున్న వాడు మరొకరికి డబ్బుకోసం అమ్మేస్తాడు. ఆడవాళ్ళ యిష్టాయిష్టాలతో పనిలేకుండా చేస్తారు. 'ఈ ఆడబతుకులు కుడి ఎడంగా ఎక్కడైనా వొకటేవండమ్మగారూ మా బతుకులు బాగుండయ్యని మీరనుకుంటారు' (71 : 2009) అని బ్రాహ్మణ స్త్రీ హనుమాయమ్మతో అంటుంది మాలచ్చిమి.

స్త్రీ అనేదే కష్టాల పరంపర. హద్దులంటూ లేవు. అది ఎప్పుడైనా జరుగవచ్చు. స్త్రీకి హింస ఒక నిరంతర ప్రక్రియగా కొనసాగుతోంది.

**ఆర్థిక స్థితిగతులు :** గిరిజన స్త్రీల జీవితంలో తిండికి కూడా దొరకని పరిస్థితి ఉంది. రోజు వారి తిండి వారి జీవితాలలో పులినీళ్ళు. ఎప్పుడైనా చిన్న చేపలు కాల్చుకునో, ఇగురేసుకునో తినడం చేస్తారు. చిగురు చాలా ఎక్కువగా వినియోగిస్తారు. గిరిజన స్త్రీలు శారీరక శ్రమ చేయలేని వారు బిక్షాటన చేసి జీవిస్తారు. ఆర్థికంగా పేదరికంలో ఉన్న ఎల్లి వివాహం వారి దైన్యస్థితిని తెలియజేస్తుంది.

**'పిచ్చి పిల్ల ఇది ఎట్టా బతుకుద్దో, పొద్దుగూకులూ చాకిరీ చేసే దానికి పులి నీళ్ళకు గతిలేదు. ఏం బతుకులో ఏంటో పులినీళ్ళకి గతిలేని బతుకులు' (ఎల్లి, పుట : 12) అనుకుంటుంది మాలచ్చిమి. చింతాకు కోసుకొని, బుట్టలల్లుకొని, పందులను కాసుకొని జీవించే ఎరుకుల జీవిత నేపథ్యంలో ఆ స్త్రీకి తినడానికి కూడా ఏమీ లేని స్థితిని చాలా చక్కగా చిత్రించారు రచయిత.**

'పిచ్చి పిల్ల ఇది ఎట్టా బతుకుద్దో, పొద్దుగూకులూ చాకిరీ చేసే దానికి పులి నీళ్ళకు గతిలేదు. ఏం బతుకులో ఏంటో పులినీళ్ళకి గతిలేని బతుకులు' (ఎల్లి, పుట : 12) అనుకుంటుంది మాలచ్చిమి. చింతాకు కోసుకొని, బుట్టలల్లుకొని, పందులను కాసుకొని జీవించే ఎరుకుల జీవిత నేపథ్యంలో ఆ స్త్రీకి తినడానికి కూడా ఏమీ లేని స్థితిని చాలా చక్కగా చిత్రించారు రచయిత.

**భార్యపై అనుమానం :** 'అనుమానం పెనుభూతం' అన్నట్లుగా ఎల్లి భర్త తిమ్మయ్య చేపలు పడుతుంటే ఈత చువ్వలు కొట్టడానికి వచ్చిన జీవాలును చూస్తుంది ఎల్లి. అది చూసి కోపంతో తిమ్మయ్య 'ఏమే ఏ రంకు మొగుడి మీద ఉందే నీ చూపు' అంటూ కొడతాడు. దాంతో ఎల్లి పుట్టింటికి వెళ్ళిపోతుంది. అనుమానంతో కొట్టడం ఒక్క అగ్రవర్ణాల స్త్రీల విషయంలోనే కాదు గిరిజన స్త్రీ జీవితంలోనూ ఉంది. అనుమానమనే జబ్బుతో స్త్రీని పురుషుడు నానారకాల మాటలతో శారీరకంగా, మానసికంగా హింసపెట్టడం పురుషాహంకారమేనని చాటుతుంది. ఈ నవలలో ప్రతి పాత్ర ఒక విభిన్నతను సంతరించుకోవడం రచయిత నైపుణ్యానికి తార్కాణం.

నేడు సమాజంలో స్త్రీలు మూడు రకాలుగా దోపిడీకి గురవుతున్నట్లు స్పష్టమవుతుంది. ఒకటి దోపిడీ చేయబడే వర్గంలో స్త్రీగా, రెండవది దోపిడీకి గురయ్యే స్త్రీగా, మూడవది వర్గాలకతీతంగా కొన్ని ప్రత్యేక సమస్యల స్త్రీగా రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా వారి స్థానాన్ని బట్టే స్త్రీల స్థానాన్ని అంచనా కట్టాలి అంటారు స్ఫూర్తి స్త్రీవాద సాహిత్యానికి మరోవైపు వ్యాసంలో (స్త్రీ వాద వివాదాలు – సం. డా. ఎస్వీ సత్యనారాయణ, పు.ట : 86) స్ఫూర్తి చెప్పిన మూడు రకాల దోపిడీలు ఎల్లి నవలలో ప్రత్యక్షంగా కన్నులకు కట్టినట్లుగా చిత్రించారు అరుణ.

**మూఢ నమ్మకాలు :** గొల్ల వాళ్ళ ఇంట్లో బుధవారం ఆడపిల్ల పుడితే అరిష్టమనే నమ్మకం ఉంది. ఆ రోజు పుట్టిన స్త్రీని వేరే కులం వాళ్ళకు ఇచ్చేస్తారు. ఈ నవలలో కూడా బుధవారం పుట్టిన మాలచ్చిమిని ఎరుకుల వాళ్ళకు ఇవ్వడం జరిగింది.

**స్త్రీ తిరుగుబాటు ధోరణి :** పారోతి భర్త బిచ్చాలు సారాయి కొట్టు వద్ద బేరమాడి భార్యను అమ్మేస్తాడు. భార్య గోల చేస్తుందేమోనని బిచ్చాలు భయపడుతుంటే ఒకడు కోడినడిగి మసాలా నూరుతారేరా! అంటాడు. పిల్లల తల్లిని, అమ్మిన వాడితో పంపటానికి పూనుకోవడంతో ఊరువాడా ఏకం చేసి యాగీ చేస్తుంది పారోతి. నలుగురూ బిచ్చాలును తిట్టడంతోనూ, వచ్చినవాళ్ళు భయపడటంతోనూ పారోతి ప్రమాదం నుంచి తప్పించుకుంటుంది.

పందికి విరిగిన కాలు చూసిన పారోతి ఇక నా పిల్లలకు, నాకు కూడు పెడుతుందా? అని ఏడుస్తుంది. బిచ్చాలుకి కోపం వచ్చి 'నోరు ముయ్యమన్నానా, వూళ్ళో వాళ్ళతో తన్నిద్దామని గాకపోతే ఎందుకే ఆశోకాండాలు, నోరు తెరిచావా మక్కిలిరిగినియ్యో' (ఎల్లి, పుట : 2) అంటాడు. దాంతో పారోతికి కోపం వచ్చి మక్కెలెందుకిరుగుతయ, నీ బతుకు జెడ, కాణి చేతికి దొరికిందంటే తాగి తందానాలాడతావ్. కాణి పనిజెయ్యవ్. ఆటిని అట్టా మట్టు బెట్టి, నా పిల్లల నోట్లో మట్టి గొడదామని కూర్చున్నావా, అదేమంటే తన్నొస్తావా, ఏం పాయే కాలమొచ్చింది. అన్నీ తిన్నగా ఏడవొచ్చుగా. నీ తోటోళ్ళంతా కాపురాలిట్టాగే ఎలగబెడతన్నారా" (ఎల్లి, పుట : 2) అంటూ తిరుగుబాటు ధోరణితో మాట్లాడుతుంది. అవసరమైతే స్త్రీ తిరుగుబాటు చేయడం, తగ్గడం కూడా చేస్తుంది. తనకు కావలసినవి దక్కించుకోవడం కూడా స్త్రీ చేయగలదని పారోతి పాత్ర ద్వారా నిరూపితమైంది.

**ముగింపు :** స్త్రీ జీవితం ఎక్కడైనా ఒకేలా ఉంది. అగ్రవర్ణాల స్త్రీలలో ఉండే బాధలు ఒకరకమైతే, గిరిజన స్త్రీ బాధలు మరోరకంగా ఉన్నాయి. కట్నం ఇచ్చుకోలేక పెళ్ళిళ్ళు జరుగలేదని బాధపడుతున్న కాలంలో గిరిజన స్త్రీలలో ఓలి అనే దురాచారం వల్ల ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, శారీరకంగా, మానసికంగా నలిగిపోతున్నారు. పులినీళ్ళకి కూడా నోచుకోలేక పడుతున్న శారీరక శ్రమ చెప్పనలవి కానిది. సభ్య సమాజంలో సతమతమైపోతున్న స్త్రీ జీవితం ఈ నవలలో వ్యక్తీకరించబడింది. మానసికంగా గిరిజన స్త్రీ అనుభవిస్తున్న జీవితం ఎల్లి నవలలో చక్కగా అభివర్ణితమైంది.



కవిత

- పి. గోపినాథ్
9440572989

# కాలంతో సమరం



ఏ కాలానికీ పాడలేని కొయ్యకోయిల బొమ్మల్లా
విపత్తుల కాలంలో కూడా గొంతు విప్పకుంటే ఎలా?
కాలంతో కలిసి నడవడమంటే
కళ్ళు మూసుకుని బ్రతకడం కాదు
మూలాల్లోకి పోయి
కాలగర్భంలోని జీవిత శకలాలను వెదకాలి
కాలపురుషుల కాటుకు బలి అయిన
కోట్లాది బతుకులను చదివి
సాగుతున్న కాలంతో సమరం చేయాలి
కోయిల నోరు విప్పకున్నా
వసంతం తనంతట తానే వస్తుంది
నీ కాలంలో నువ్వు పోరాడకుంటే
ముందు తరాలకు చీకటి మిగులుతుంది
వయసుడిగి మూడు కాళ్ళూ ముడుచుకొని
ఒంటి కాలితోనే కుంటుతోందంటున్న కాల'ధర్మం' ముసుగు తీసి
కాలచక్రగమనంలో.... కష్టసుఖాల సంక్రమణంలో
మన మెలకువ నిద్రల మధ్యన దొంగల్లా నక్కి ఉన్నదెవ్వరో
ఒడుపుగా అందలమెక్కి తెగమెక్కి బలిసినదెవ్వరో
కనిపెట్టడమే జీవితాలను మార్చే కాలజ్ఞానం
కాలం ఏదైనా...
కళ్ళెం పట్టినోడి మార్గమే కష్టాలకు హేతువు
పీడన నెదిరించి పోరాడిన వాళ్ళనే బ్రతికించింది మృత్యువు
అమృతం జుర్రే అవకాశవాదుల మోచేతిక్రింద
ఆశలతో పట్టిన దోసిళ్ళలో
ఎంగిలి చుక్కైనా జారిపడని చోటల్లా
కన్నీళ్ళు మండి కాలం సంక్షుభితమైంది
అక్కడే సంఘర్షణ మొదలైంది
కాల చరిత్రలోని కఠిన సత్యం ఇదే !
ప్రశాంత వసంతాలను కోరి
కాలం ముందు తలవొంచి ముడుచుకుపోయే మెదళ్ళు
కష్టాల కక్ష్యల్లోనే భ్రమిస్తూ
ఘనీభవించి పోయేగ్రహాల వంటివి
కాలానికి ఎదురీదే శక్తులు
కాలాన్ని శాసించే నక్షత్రాలకన్నా గొప్పవి
విశ్రాంతి కోసం ఎదురు చూపులు జీవితకాలమే
విముక్తి కోసమైతే... లభించేదాకా కాలంతో పోరాటమే !!

---

నాగేందర్
9985119146

# బతుకు



అతనిది బ్రహ్మాండమైన చదువు
బహుళజాతి కంపెనీలో ఉద్యోగం
లక్షల్లో జీతం... ఖరీదైన జీవితం
ఇంతలో అనుకోకుండా ఓ కష్టం
ఆత్మహత్యతో దానికి పరిష్కారం
జీవితాన్ని ఎలా గెలవాలో
నేర్పిన చదువు
బతుకును ఎలా ఎదుర్కోవాలో
నేర్పలేదు
సముద్రం ప్రశాంతంగా ఉందని
సంతోషపడకు
భయంకరమైన మొసళ్ళు, తిమింగలాలు
కాచుకొని ఉంటాయి
దేశం బ్రహ్మాండంగా అభివృద్ధి
చెందుతోందని ఆనందపడకు
కోలుకోకుండా దెబ్బతీసే
పెనుభారాలు పొంచి ఉన్నాయి

కథ

# పొద్దుపోని పంచాయితీ?



డా॥ ఎం. హరికిషన్
9441032212

**అనా... బాగున్నావా... నాకు తెలుసు పొద్దున లేసినప్పటి నుంచి రాత్రి పండుకొనేదాకా నీకు ఇంటా బైటా మస్తుగ పంచాయితీలుంటాయని. ఐనా... ఒక ఐదు నిమిషాలు అటూ యిటూ పరుగులు పెట్టకుండా మట్టసంగా ఒకతాన నిలుచుంటే నేను చెప్పేదేదో చెప్పేస్తా... ఆపైన నీ ఇష్టం. ఇంతకూ నేనెవరో చెప్పలేదు గదా... నేను మాజీ సర్పంచ్ రాజమ్మనన్నా... పార్టీ అంటావా... ఈ లోకంలో ఆడదానికి ఏ పార్టీ ఐతే ఏంలే గానీ... అదిగో ఆడ దూరంగా బడి దగ్గర జనాలంతా వరుసగా నిలబడి ఓట్లేస్తావున్నారు సూడు... అది కొత్త సర్పంచును ఎన్నుకోడానికి.**

ఇంతకు ముందీడ కాంగ్రెస్సు, తెలుగుదేశమె వుండె. ఇప్పుడు వైఎస్సార్‌పార్టీ గూడా వచ్చింది. పొద్దుగూకే సమయానికంతా ఎవరు గెలుస్తారో, ఎవరు ఓడిపోతారో తెల్సిపోతాది. ఈ సారి గూడా నేను ఎన్నికల్లో నిలబన్నా... ఏ మాటకామాట సెప్పుకోవాల గానీ నిలబన్నానని చెప్పాలంటే చానా సిగ్గుగా వుంది. అది వుత్తిత్తి మాటే. నా మొగుడు నిలబెట్నాడు.

ఆ రోజు నుంచీ నాకు ఒకటే భయం. కొంపదీసి మళ్ళా గెలుస్తానేమోనని. ఈ సారి నేను నిలబడనని నెత్తీనోరూ కొట్టుకున్నా వినకుండా ఈ సచ్చినోడు చెంపమీద రపరపరపమని నాలుగుపీకి మరీ నిలబెట్నాడు. వీని చేతులిరిగిపోనూ... ఏమిట్లా మొగున్ని పట్టుకోని తిడతావుంది అనుకుంటున్నావా... ఇంతకుముందు వెలగబెట్నా గదా ఐదు సమ్మచ్చరాల సర్పంచ్‌గిరీ... అది గుర్తుకొచ్చిందిలే...

నా మొగునికి మొదట్నించీ రాజకీయాలంటే ఒగటే జిల. రాసుకోని, పూసుకోని, కాలరెగరేసుకోని, ఖద్దరేసుకోని తిరుగుతావుంటాడు. రోడ్డు దగ్గరున్న భూములకి రెక్కలు రావడంతో ముడ్డికింద మూటలు మూలగడం ఎక్కువైంది. ఎవడెక్కిచ్చినాడో ఏమోగానీ ఈసారి సర్పంచ్ ఎలచ్చన్లలో నిలబడాలని నిర్ణయించేసుకొన్నాడు. కానీ అదేమో ఆడోళ్ళకు రిజర్వయింది. ఐనా వదుల్తేనా నన్ను ముందుకు తోస్నాడు. ఎమ్మెల్యే గూడా మద్దతుగా తలూపినాడు. దాంతో సంచులు తీసుకోని, జనాలనేసుకోని వూరిమీద పన్నాడు. అవతలోళ్ళు గూడా తక్కువ తినలేదనుకో. ఎవనికి చేతనైనంత వాళ్ళు... సారా ప్యాకెట్లు, బిర్యానీ ప్యాకెట్లు, గుట్కాలు, సిగరెట్లు, చీరలు, రవికలు, ఇంటింటికీ డబ్బులు పంచడాలు... వూరంతా పండగ చేసుకుంది.

ఎలచ్చన్లయిపోయి ఓట్లు లెక్కపెట్టడం మొదలయ్యింది. అందరి మొఖాల్లోనూ ఒగటే టెన్షన్. నాకైతే కాలూసేయీ ఆడక ఒక మూల గమ్మున కూచుండిపోయా. ఒకొక్క రౌండ్ పూర్తవుతున్న కొద్దీ టెన్షన్ మరింత పెరుగుతావుంది. రౌండు రౌండుకూ విజయం మారుతూవుంది. చివరికి రెండు రౌండ్లు మిగిలినాయి. అవతలోళ్ళకు మెజార్టీ యాభైపైన్నే వుండింది. ఆ రెండింటి మీదే మా ఆశ.

అంతకు ముందు రోజు రాత్రే వూర్లోని రెండు పెద్ద గేర్లతో ఒప్పందం జరిగింది. "చూడు... మాది మాటంటే మాటే...



ఏదో ఒకటో రెండో జారోచ్చు గాని మిగతావన్నీ గుంపగుత్తగా పడిపోతాయి. ఎంతిస్తారో చెప్పండి. మేమేం మా కోసం అడగడం లేదు. గుడికీ, చర్చీకీ అడుగుతున్నాం. ఎవరెక్కువిస్తే వాళ్ళకే మా ఓట్లు" అన్నారు. అర్ధరాత్రి దాకా పాట సాగింది. ఆఖరికి నా మొగుడు అందరికంటే ఎక్కువకు ఒప్పుకోవడమే గాకుండా అప్పటికప్పుడు డబ్బులు చేతిలో పెట్టేసినాడు. సరిగ్గా ఆ రెండు వార్డులవి అప్పుడొచ్చినాయి. ఐనా ఏదో మూల చిన్న అనుమానం. ఈ మధ్య జనాలు ఎడమచేత్తో ఒకని దగ్గర తీసుకోని కుడిచేత్తో ఇంకొకనికి గుద్దేస్తున్నారు. కానీ కులపెద్దల పట్టు ఇంకా జారినట్టులేదు. అంతవరకూ ఆధిక్యంలో వున్న అవతలి పక్షం కాస్తా నిమిషనిమిషానికీ తగ్గిపోయింది. చివరి రౌండు ఎంచేసరికి విజయం ఇంటి ముంగిటకు వచ్చేసింది. ఆ మరుక్షణమే బైట ఒకటే అరుపులు, కేకలు, సంబరాలు.

నన్ను లోపలికి పిలుచుకోని పోయినారు. సంతకాలు చేపిచ్చుకోని గెలిచినట్లు కాగితం చేతిలో పెట్టినారు. బైట తప్పెట మోత మోగిపోతోంది. నా మొగున్ని భుజాల మీదకు ఎత్తుకోని ఎగురుతావున్నారు. ఆడోళ్ళని వూరేగిస్తే ఏం బాగుంటుంది. అందుకే నా మొగున్ని ఎత్తుకోని మురిసిపోతున్నారని సంబరపన్నా. అదీగాక నేను గెలిచినానంటే అదంతా నా మొగుని పనితనమే గదా అందుకే సంతోషపన్నా... అప్పటికే ట్రాక్టర్ తయారైపోయింది. "చంద్రన్న జై... సర్పంచ్ చంద్రన్న... జిందాబాద్" అని అరుస్తావున్నారు. పూలదండల్తో ముంచెత్తినారు. మా మరిది వచ్చి నన్ను తీసకపోయి ఇంటిలో దిగబెట్నాడు. తప్పెట్ల శబ్దం అర్ధరాత్రి దాకా వినబడుతూనే వుంది. సారా వాసన వూరంతా మత్తుగా కమ్ముకుంది. ఇంట్లో నేనూ, నా కూతురూ ఒకరికొకరు తోడుగా వుండిపోయినాం.

ఆ రోజు రాత్రి అసలు నిద్రే రాలేదు. మనసంతా ఏదో ఉద్వేగం. ఆనందం. ఈ రోజుతో ఆ వూరికి సర్పంచ్ అయిపోయానని, రోడ్డు మీద పోతావుంటే అందరూ "రాజక్కొచ్చిందిరా... సర్పంచొచ్చిందిరా" అంటూ దండాలు పెడుతున్నట్లు, వాళ్ళ మంచి చెడ్డలు చెబుతున్నట్లు, ఆగష్టు 15కి బళ్ళో పిల్లలందరి ముందూ జెండా ఎగురేసినట్లూ, వూరికి కావాల్సిన పనులు చేయించినట్లు, మంచి పేరు సంపాదించుకోని అందరితో పొగిడించుకొన్నట్లు... ఏవేవో కలలు. ఆలోచనలు. కలత నిద్ర. అట్లా వూహల్తో కొన్ని రోజులు బాగానే గడిచిపోయినాయి. అప్పుడప్పుడు ఎవరెవరో నా మొగునితో పాటు వస్తుంటారు. ఏదేదో చెబుతుంటారు. సంతకాలు చేపిచ్చుకుంటూ వుంటారు. అర్థం చేసుకోడానికి ప్రయత్నించసాగా... మా నాయన డబ్బులకు ఎనకాడకుండా మా తమ్మున్ని బస్సెక్కించి కర్నూలులోని కాన్వెంటుకి పంపిచ్చినాడు గానీ నన్ను మాత్రం మా వూరి చిన్నబడికే తోలినాడు. అందుకే అంత తొందరగా అర్థమయ్యేవి కావు.

కానీ ఆ సంబడం ఎక్కువ రోజులు సాగలా. నాలుగో నెల జరిగిందా సంఘటన. తలచుకొంటే ఇప్పటికీ ఒళ్ళు కంపరంతో కంపించిపోతాది. "ఛూ...దీనమ్మ... ఈ ఆడబతుకు" అని నా మీద నేనే వుమ్మేసుకోవాలనిపిస్తాది.

ఆరోజు పొద్దున్నే పంచాయితీ కార్యదర్శి వచ్చి ఇంటి తలుపు తట్నాడు. నా మొగుడు ఏదో పనుందని అప్పటికే కర్నూలుకి పోయినాడు. ఇంట్లో నేనొక్కదాన్నే వున్నా. "అమ్మా... చానా అర్జంటు. మరుగుదొడ్లు కొత్తగా కొందరికి ఇస్తారంట. కొంచెం సంతకం పెట్టు. కలెక్టరికివ్వాల. ఈరోజే ఆఖరు" అంటూ ఓ నాలుగు కాగితాలు ముందుంచినాడు. సరే అత్యవసరమంటున్నాడు గదాని సంతకాలు పెట్టిన. ఆరోజు సాయంత్రం జరిగిందా గొడవ.

నా మొగుడు రావడం రావడం "ఏమే... లంజా... నాకు తెలీకుండానే సంతకాలు పెట్టేటంత పెద్దదానివై పోయినావా... మొగుడనేటోడు ఒకడున్నాడు. వానికోసారి ఫోన్ చేసి కనుక్కుందామనిల్యా" అంటూ వంగబెట్టి దభీ దభీమని నాలుగు గుద్దులు గుద్దినాడు. పుల్లుగా తాగినట్టున్నాడు. నోట్లో వాసన గుప్పుమని కొడతావుంది.

"అదిగాదు... పాపం... ఆడోళ్ళు పొద్దున్నే బైటకు పోలేక కిందామీదా అవుతుంటారు గదా... మరుగుదొడ్లు మంజూరయితే మంచిదే గదా... అందుకని" అంటూ నీళ్ళు నమిలింది.

"అవ్... మంచిదే... గానీ... మరుగుదొడ్లు మనోళ్ళ కొస్తున్నాయో... పక్కనోళ్ళకొస్తున్నాయో... సూసుకోవద్దా" గట్టిగా అరిచినాడు గసబెడతా...

"గెలవకముందు పరాయోళ్ళయినా గెలిచినాక అంతా మనోళ్ళేగదా... అందరితోనూ మంచిగుంటేనే గదా మంచి పేర్చొచ్చేది" అన్నా.

అంతే గయ్యిమని పైకి లేస్తా "అబ్బో... సర్పంచయినాక మాటకు మాట లేస్తుందే... పొగరు తలకెక్కిందే ఈ మధ్య నీకు. నీలాంటి తలబిరుసుదాంతో కాపురం కష్టమే. పో... పోవే... నా ఇంట్లోంచి" అంటూ మెడ పెట్టుకోని బైటకి దొబ్బినాడు.

ఆ అరుపులకు కేకలకు వీధిలో అందరూ గుమిగూడ్నారు. ఎవరూ ముందుకు రావడం లేదు.

"ఈ రోజు సంతకం చేయమంటే చేసినావు. రేపు వండుకోమంటే వండుకుంటావు. నేనంటే లెక్కా జమాలేకపోయినాక ఇంకెందుకు ఇక్కడుండడం. మళ్ళా ఈ ఇంటి గడప తొక్కినావంటే కాళ్ళిరగ్గొడతా చూడు" అంటూ మత్తు దిగేదాకా రంకెలేస్తూ, నానా బూతులు తిడ్తూ ధడేలున తలుపులు మూసేసినాడు.

వీధిలో అందరిముందూ తల కొట్టేసినట్టనిపించింది. ఒకొక్కమాటా కత్తితో చీరేసినట్లనిపించింది. చుట్టుపక్కలున్నోళ్ళు అటువంటివన్నీ చానా మామూలే అన్నట్లు ఎవరిండ్లలోకి వాళ్ళు వెళ్ళిపోతున్నారు. ఆ రోజంతా పక్కింట్లోనే పడుకోవాల్సొచ్చింది.

విషయం తెలిసి అందరూ నన్నే తప్పు పట్టినారు. "ఆడదానివి. నోరు మూసుకోని ఇంటి పనులు చూసుకోక వూరి



పెత్తనాలు నీ కెందుకు సెప్పు. వాడు చూసుకుంటాడు గదా అన్నీ" అంటూ...

అంతే... ఆ రోజు నుంచీ బెల్లం కొట్టిన రాయిలా గమ్మునుంటూ మళ్ళా ఎప్పుడూ ఎక్కడా తలదూర్చలా. ఎవడన్నా తెలీక నా దగ్గరకొచ్చినా ముందు నా మొగుని దగ్గరికే పొమ్మని చెప్పసాగినా. నా మొగుడు గూడా నన్ను పూర్తిగా ఇంటికే బందీ చేసినాడు. నెమ్మదిగా అందరూ నన్ను మర్చిపోసాగారు. వూరోళ్ళయితే నవ్వసలు పట్టిచ్చుకొనేటోళ్ళు గాదు. సర్పంచ్ లెక్క పలకరించే టోళ్ళు గాదు. ఆళ్ళ దృష్టిలో నా మొగుడే సర్పంచు. చిన్న పనైనా, పెద్ద పనైనా అంతా ఆని దగ్గరికే అధికార్లు మొదట్లో అప్పుడప్పుడు నా దగ్గరికి వచ్చేవాళ్ళు. వాళ్ళు గూడా దారి మార్చినారు. ఏ పనున్నా సక్కగా నా మొగునికే ఫోన్ చేసేటోళ్ళు. ఎవరొచ్చినా. ఎక్కడికెళ్ళినా అంతా నా మొగుడే. రాత్రి పూట సంతకాలు చేయడం మాత్రమే నా పని.

సరే... ఎప్పుడూ బాధేనా... సంతోషపన్న రోజు ఒక్కటీ లేదా... అని ప్రశ్నించుకుంటే నాకోసారి మాత్రం భలే సంతోషమేసింది. నా ఐదు సమ్మచ్చరాల పదవీకాలంలో అంత సంబరపన్న కాలం ఎప్పుడూ లేదు. ఇప్పటికీ అది తల్చుకుంటే చాలు ఫక్కున నవ్వొచ్చేస్తాది.

నా మొగుడు అట్లాంటిట్లాంటోడు గాదు. పెద్ద దకాటీ. వూర్లో అపోజిషన్ పార్టీవాడు ఎవడన్నా పనికోసం దగ్గరకొస్తే "ఏంరా... నీవేమన్నా నాకు ఓటేస్తివా... అడగ్గానే వురుక్కుంటా పనిచేసి పెట్టడానికి" అనేటోడు. అదే ఓటేసినోడు వచ్చినాడనుకో "వాయబ్బో... భలే సంబడంగ వచ్చినావులే వూపుకుంటా... నీవేమన్నా వూకేస్తివా ఓటు. దొరికినా కాడికి గుంజలా" అని కసిరిచ్చుకునేటోడు. అట్లాంటోడు ఒకదాంట్లో భలే ఇరుక్కున్నాడు.

ఆ మధ్య ఒక సినిమా హీరో కొత్త పార్టీ పెట్టుకొని వుత్తమాటలు చెప్పుకుంటా... గాల్లో మేడలు కట్టి చుక్కలు చూపిస్తూ... ఆఖరికి కలబన్నోళ్ళనే కర్సుకోని కలసిపోయినాడు చూడు... ఆయనంటే మా వూర్లో పొట్టెగాళ్ళందరికీ అప్పట్లో భలే మోజు. దాంతో అందరూ నా మొగుని చుట్టూ చేరి "అనా.. అనా.. ఆ ఎన్టీవోని తర్వాత మళ్ళా అట్లాంటోడు ఇప్పుడొచ్చినాడు. సుడిగాలిలెక్క చుట్టుకోని అన్ని పార్టీలోళ్ళని ఎత్తుకపోయి బంగాళాఖాతంలో పడేస్తాడు. ఈ సారి అసెంబ్లీ ఎన్నికలకు మన హీరోకెళ్ళి తిరుగు. మేమంతా నీ వెనుకే వుంటాం. ఏ పనైనా కాల్తో సెప్తే సేత్తో చేసి పడేస్తాం. మనోడు ముఖ్యమంత్రయితే మన దర్జానే మారిపోతాది" అని గాల్లో కెత్తినారు. నా మొగుడు గూడా ఆని అభిమానే. మొదటిరోజు మొదటాటకు పంచపైకెగ్గట్టి పరుగులెత్తే రకం. దాంతో నక్కకు నాగలోకానికి తేడా కనుక్కోలేక ఎప్పుడు జై కొట్టే ఎమ్మెల్యేని గాదని, కొత్త పార్టీ నిలబెట్టిన ఒక పాతరెడ్డికి మద్దతిచ్చి ఇంటిపైన జండా పాతినాడు.

అది చూసి ఎమ్మెల్యేకి కోపం అరికాలినుంచి నసాళానికి అంటింది. నాకు గూడా నచ్చక వద్దని చెప్పినా... దాంతో నా మీదకు ఇంతెత్తున లేచి "ఆడదానివి... గుద్దా మూతీ తెలీదు. నేను నిలబడ్తే కూచున్నదానివి. నాకే చెప్పొచ్చేంత దానివయినావా... మూసుకోని కూచో గమ్మున" అన్నాడు. సరే... ఆ ఎన్నికల్లో ఏమయిందో మీకు తెలియంది కాదు. దెబ్బకి నా మొగునికి చలి జ్వరం వచ్చినట్టయింది. మళ్ళా ఆ ఎమ్మెల్యేనే గెలిచినాడు. వాడు మామూలోడు గాదు. కాలికేస్తే మెడకు, మెడకేస్తే కాలికి వేసేరకం.

ఒకసారి సర్పంచ్‌లకంతా సమావేశం. ఎప్పట్లాగే నా మొగుడు వూపుకుంటా పోయినాడు. దానికి జిల్లా అధికారుల్తో బాటు ఎమ్మెల్యే గూడా వచ్చినాడు. సమావేశం మధ్యలో అందరిముందూ మైకులో "రేయ్... ఏం పనిరా నీకిక్కడ. సర్పంచ్ నువ్వా నీ పెండ్లామా. పో... పోయి నీ పెండ్లాన్ని అంపియ్యి. నువ్వుండాల్సింది గేటు కవతల్నే. ఇంగోసారి లోపల గనుక కనబన్నావనుకో... మెడపట్టి దొబ్బిస్తా... ఏమనుకున్నావో" అని నోటికొచ్చిన తిట్లన్నీ తిట్టినాడు. ఆ దెబ్బకు నా మొగుడు తలాడ బెట్టుకోవాల్నో అర్థం గాక మొగమంతా నల్లగా చేసుకోని ఇంటికొచ్చినాడు. విషయం తెలిసి నేను లోపల్లోపల భలే నవ్వుకున్నా. ఆ నెలరోజులూ నేను పోతావుంటి మీటింగులకి నా మొగున్ని బైట నిలబెట్టి.

కానీ... ఈ సిగ్గులేనోడు అందరు రాజకీయ నాయకుల లెక్కనే మళ్ళా పార్టీ ఫిరాయించినాడు. తెలిసినోళ్ళని పట్టుకోని కుక్కలెక్క తోకాడించుకుంటా ఎమ్మెల్యే కాళ్ళ దగ్గరికి పోయినాడు నాకడానికి. దాంతో ఆయన వార్నింగిచ్చి వదిలేసినాడు. అట్లా నా సంబడం ఆ నెల రోజులు మాత్రం వుండింది.

కలెక్టర్లు, మండలాధికారులు, ఇంజనీర్లు... కిందినుంచి పై వరకూ వున్నారు గదా పెదింతమంది. ఒక్కరంటే ఒక్కరన్నా పట్టించుకుంటారా ఈ అన్యాయాన్ని. వూహూ... ఈళ్ళూ మొగోళ్ళే గదా... ఓ పెద్ద వుద్ధరించామని వీధుల్లో వీరంగాలు పోతూ తల్లుల్ని, పెండ్లాల్ని, బిడ్డల్ని ఇంట్లో పెట్టి తాళాలేసే జాతి. ఈ ఐదు సమ్మచ్చరాల్లో ఒక్క నిఖార్సయిన అధికారన్నా వస్తాడేమోనని కళ్ళు కాయలు కాసేటట్టు ఎదురు చూసినా... వూహూ... లాభం లేదు... ఆడంగినాయాళ్ళు. ఉత్సవ విగ్రహాలన్నా సమ్మచ్చరానికి ఒకసారి వూరేగుతాయి గానీ మా బతుక్కి అదీ లేదు. అందుకే బొమ్మలెక్క వుండలేక ఓడిపోతే బాగుంటుందని ఎదురు చూస్తా వున్నా...

ఏ మాటకామాట చెప్పుకోవాలగానీ... ఈ దేశంలో ఆడళ్ళకు అధికారం రావాలంటే మొగాళ్ళు జైలుకన్నా పోవాల, పైకన్నా పోవాల. దేముడు నాకంత అదృష్టం రాయలా... ఓన్నోవ్... ఏదో మాటవరసకు తమాషాగా అట్లా అన్నా... మళ్ళా నువ్వుపోయి నా మొగునికి ఎక్కించేవు. వాడసలే మంచోడు గాదు. బతికుండగానే బూంచి పెట్టే రకం... అయినా నువ్వూ మొగోనివే గదా... నీకు చెప్పినా ఆ గోడకు చెప్పినా ఒక్కటే... ఐనా తెలిసి తెలిసీ వుండబట్టలేక మళ్ళా మళ్ళా చెబుతానే వుంటాం... పొరపాట్న ఒక్కనికన్నా మా బాధ ఎక్కుతాదేమోనని.



# సహజనాయిక

- పురిమళ్ల సునంద
9441815722

రెప్పల వాకిట్లో వాలిన నిద్రపిట్టను
చిటికెలతో అదిలించినా
చన్నీటితో విదిలించినా
కదలనని మొరాయిస్తుంటే...
అలసిన మనసు - పులిసిన మేను
సమ్మెకు మద్దతు ప్రకటిస్తుంటే....
అపరాహ్ణవేళ అరగంట
అవకాశ మిస్తానని వాగ్దానంతో...
లోగిట్లోని నిద్రపిట్టను
రెప్పలెత్తి రెక్కపట్టి
బయటికి పంపుతున్నప్పుడు
కోడికూతను విసుక్కుంటూ
ఎజెండా ఏమిటో చెప్పమనే
అవయవాల అసహనానికి సమాధానంగా
వంటింట్లోకి...
సింక్‌లోని గిన్నెలు ఆరున్నొక్క రాగాలాపన
తలంటుపోసి తళ తళ లాడించమని
విడిచిన బట్టల వీరంగం
సంస్కారవంతమైన సబ్బుతో
సహజరూపు తెప్పించమని
కట్టుకున్న శ్రీవారి కదన కథాకళి
కాఫీ టిఫెన్లిచ్చి
కార్యాలయానికి పంపమని



అత్తగారి పూజకోసం
అరమోడ్పులతో
మందారాల పలకరింపు
వాకిట్లోకి దూసుకొచ్చిన
వార్తాపత్రిక హెచ్చరిక
వాలు కుర్చీలోని
మామగారికి వినయంగా
అందించమని
సరిహద్దు సైనికుల్లా పిల్లల
సతాయింపు
తమ విషయం పట్టించుకోమని
దాగుడు మూతల కాలం ఆటలో
పిల్లికి దొరక్కుండా ఎలుక పరుగు
విరామ మెరుగని పరుగుల దేహం
ప్రమాద సూచికలు ఎగరేస్తున్నా
పట్టించకోని అమ్మతనం
పాత్రల్లో పోసిన జలంలా ఒదిగిపోతూ
కన్నీళ్ళను ఒలకనీయక
ప్రసార మాధ్యమాల ఆర్భాటం -
మహిళా దినోత్సవ కిరణాలు సోకి
అంతరంగంలోని ఆరు ప్రాణాల భావాలు
ఒక్కసారిగా అలజడికి లోనై
ఆకాశంలో సగం నీవంటూ
అస్థిత్వాన్ని ప్రశ్నిస్తుంటే
ఏదో ఆశ మిణుకు మిణుకు మంటూ
అంతరం లేని సమాజం కోసం
ఆశగా ఎదురు చూస్తూ
అనామికను కాదు
సమాజంలో 'సహజ నాయిక' ను
నేనే అని గుర్తు చేస్తూ....

# చందమామ పదాలు

బండి ప్రసాదరావు

జోల పాటలు జచ్చె
గోల పాటలు వచ్చె
పాల గుండెను గుచ్చె
ఓ చంద మామ !

ఓటు వేటన వారు
కూటి బాటన వీరు
పాటులేకనె పోరు
ఓ చందమామ !

స్వార్థ యావయె జోరు
అర్థ యావతో పోరు
శుద్ధ బుద్ధులు వేరు
ఓ చందమామ !

కూలి డొక్కలు నిండ
మాలి కొట్టులు నిండు
కూలి మాలికి ఫండు
ఓ చందమామ !

గద్దె పెద్దకు ముద్దు
ముద్ద పేదకు రద్దు
వృద్ధి ఉపాధి కద్దు
ఓ చంద మామ !

మనసు నంటిన తప్పు
యినుము నంటిన తుప్పు
తనువు తూట్లగుజెప్పు
ఓ చంద మామ !



## నేనొక ఒంటరిని !


- భీంపల్లి శ్రీకాంత్.

9032844017




ఇప్పుడు నేనొక ఒంటరిని
అనేక స్వప్నాల మధ్య
అనేక భయాల మధ్య
అభద్రతావలయంలో చిక్కుకుని
జీవిస్తున్న బతుకు జీవుణ్ణి
ఏ భద్రతా కవచం లేని -
అభద్రతా విషాదాన్ని
పద్మవ్యూహంలో చిక్కుకున్న
నిత్య అభిమన్యుణ్ణి
జీవితం వరప్రసాదితమేకాదు
నవరసాల్లోని భయం కూడా
ప్రజారక్షకదళమైన
పోలీసు పహారాల మధ్య
కాచుకుని కూర్చున్న
విధ్వంస విప్లవపు డేగల మధ్య
నేనిపుడు ఒంటరిని
నిత్యం జరిగే దుస్సంఘటనలకు మౌనసాక్షిని
బూటకపు ఎన్‌కౌంటర్‌లకు,
హత్యలకు ప్రథమ ముద్దాయిని
నేనిపుడు సుషుప్తదేహాన్ని
నిర్నిద్రపు జడపదార్థాన్ని
అంటరాని అస్పృశ్యుణ్ణి
వివర్ణ విషాద వదనాన్ని
నియంత్రిత వ్యవస్థలో
బతుకుతున్న నిర్బంధపు నిర్భాగ్యుణ్ణి
నిరంతర కర్ఫ్యూలో నలుగుతున్న
కనబడని మానవ గాయాన్ని
నిత్య రక్తాగ్ని హోమంలో
ఆహుతైపోతున్న యజ్ఞోపవీతాన్ని
నిత్యరావణకాష్టానికి
దగ్ధమవుతున్న సామాన్య సమిధను
నిత్యం కత్తిగాట్ల కోరకు
బలైపోతున్న బలిచక్రవర్తిని
నిత్య దౌర్జన్యాల క్రీనీడలకు
దహనమవుతున్న అస్థిపంజరాన్ని
నేనిపుడు ఏకాకిని
గాయపడిన దేహం
ఏ కవిత్వాన్ని వినిపించగలదు
రక్తమోడుతున్న దేశం
ఏ శాంతిని ప్రవచించగలదు.
ఇది గాంధీ పుట్టిన దేశం కాదు
హింస జనించిన దేశం
ఇది నెహ్రూ ఆశించిన జాతి కాదు
అశాంతి నెలకొన్న దేశం
గాంధీ పుట్టిన దేశం సాక్షిగా
నేనిపుడు ఒంటరిని !
స్వాతంత్ర్యం తెచ్చిన గాంధీ సాక్షిగా
నేనిపుడు గాయపడిన దేహాన్ని !!

# అభివృద్ధి పేరిట జరుగుతున్న విధ్వంసంపై నిరసన

- మండవ సుబ్బారావు
9493335150



కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య గారికి అంకితం ఇస్తూ పుస్తకంగా తీసుకురావడం, ఒక ఉద్యమ నేతకు ఒక వుద్యమానికి సంబంధించిన పుస్తకం అంకితమివ్వడం సందర్భోచితం. కాంతారావు వస్తువుకూ, నవలా ప్రక్రియకు సంపూర్ణ న్యాయం చేశాడు. ఉద్యమ చరిత్ర తెలుసుకోడానికి స్వయంగా బీల ప్రాంతానికి వెళ్ళి సహ సాహితీ మిత్రులతో చర్చించి అక్కడి భాషనూ యాసనూ పట్టుకొని చక్కగా నవలను చదువరికి హత్తుకునే విధంగా రాశారు.

ఏది అభివృద్ధి? ఏది విధ్వంసం? ఏది అవసరం? ఏది అనవసరం? ఇలాంటి అనేకానేక ప్రశ్నలు అటు మేధావులకు ఇటు పాలకులకు సవాలుగా నిలసిన సందర్భం. ఒక పక్క అభివృద్ధి చెందిన అమెరికా వంటి దేశాలు తమ ప్రకృతి వనరులను రక్షించు కుంటూ, సేవల ద్వారా తమ ఆర్థికావసరాలను తీర్చుకుంటూ, ఆహారోత్పత్తుల కోసం ఇంధనావసరాల కోసం ప్రపంచీకరణ పేరుతో ప్రపంచం మొత్తం మీద ఎక్కడ ప్రకృతి సంపదవుందో ఎక్కడ పచ్చదనం వుందో అక్కడ కుట్రలతో కుతంత్రాలతో దోచుకుంటున్నాయి. బహుళజాతి కంపెనీలు స్థానిక ప్రభుత్వాల అండదండలతో ప్రజాప్రతినిధులు, అధికారులు ఏకమై అభివృద్ధి పేరిట దోపిడీ చేస్తున్నాయి. అందువలన కలుగుతున్న ప్రకృతి విధ్వంసానికి బలైపోతున్న వారు సామాన్య ప్రజలు. ముందుండి నడిపించవలసిన ప్రతిపక్ష పార్టీలు, ప్రజలను కన్న బిడ్డల్లా కాపాడ వలసిన పాలక వర్గాలు తెర వెనుక చేస్తున్న భాగోతాలు ఒక్కటొక్కటీ అవగతమవుతుంటే చలిచీమలైన సామాన్యులు ఏకమై బలవంతమైన సర్పాల్ని మట్టి కరిపించిన ఉద్యమం ఒక వాస్తవ సంఘటన. ఆ నేపథ్యంగా రాసిన నవల "ఆకుపచ్చ విధ్వంసం". ఇటీవల మన రాష్ట్రంలో సోంపేట, పలాస ప్రాంతాల్లోని బీల భూముల్లో థర్మల్ విద్యుత్ కేంద్రం ఏర్పాటు చేయతలపెట్టినప్పుడు ఆ నిర్మాణాన్ని నిరసిస్తూ సాగిన ప్రజా ఉద్యమం నేపథ్యం శిరంశెట్టి కాంతారావు నవల. ఈ నవల తొలిసారిగా అక్టోబర్, 2012 చతుర మాసపత్రికలో ప్రచురింపబడింది. అనేక మంది సాహితీవేత్తలు అభినందించారు. అంపశయ్య నవీన్ పురస్కారం కూడా పొందిన ఈ నవల కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య గారికి అంకితం ఇస్తూ పుస్తకంగా తీసుకురావడం, ఒక ఉద్యమ నేతకు ఒక వుద్యమానికి సంబంధించిన పుస్తకం అంకితమివ్వడం సందర్భోచితం. కాంతారావు వస్తువుకూ, నవలా ప్రక్రియకు సంపూర్ణ న్యాయం చేశాడు. ఉద్యమ చరిత్ర తెలుసుకోడానికి స్వయంగా బీల ప్రాంతానికి వెళ్ళి సాహితీ మిత్రులతో చర్చించి అక్కడి భాషనూ యాసనూ పట్టుకొని చక్కగా నవలను చదువరికి హత్తుకునే విధంగా రాశారు. వర్ణనలు, సామెతలు, పాత్రలు, సంభాషణలు శిరంశెట్టి నైపుణ్యాన్ని వ్యక్త పరుస్తాయి. చదువరిని ఏకబిగిన చదివించే చేవ వున్న నవల.

ఇతివృత్తం నడుస్తున్న చరిత్ర.. జీవభద్ర గ్రామంలో ఎండమ్మ పరిచయంతో కథ ప్రారంభమవుతుంది. ఎండమ్మకు జరిగిన నష్టానికి ప్రభుత్వం ఇచ్చిన చెక్కును ఉద్యమానికి ఇవ్వడంతో, "జిందాబాద్ - జిందాబాద్ ఎండమ్మా! జిందాబాద్" అక్కడి జనం చేసిన నినాదాలతో కథ ముగుస్తుంది.. ఆ విధంగా రచయిత ఎండమ్మ పాత్రకున్న ప్రాధాన్యాన్ని వ్యక్త పరుస్తాడు. అలాగే భూములకు బూమ్ ఎలా వస్తుందో సన్నివేశంతో నవల ప్రారంభించి, ఆ భూమి కోసం జనం ఎలా పరితపిస్తారో? ఎలా పోరాడుతారో? చక్కగా వివరించాడు. మాటల మాంత్రికుడు శిరంశెట్టి. సూటిగా అడగటాన్ని ఎలా చెప్పాడో చూడండి- "కొరమీను మొప్పల్లోకి బొరుసుగడ్డి వెన్నును గుచ్చినట్టు సూటిగా అడిగింది", "కనిపించని వల విసిరాడు", "జనాలంతా రకరకాలుగా అత్తణ్ణి వ్యాఖ్యానించుకోసాగారు", "చిరు, చిరు జల్లులే కదా అనుకున్నా వాన కాస్తా చూస్తుండగానే మాడు పెంకులు పగిలిపోయే వడగళ్ళ వానగా మారింది" ఇలాంటి మాటలు నవల నిండా గుబాళించాయి. ఒకచోట కాంట్రాక్టర్ల గురించి భలే బాగా చెప్పాడు." ఈ దేశంలో ఓ గుమాస్తా ఉద్యోగం చేయాలన్నా దానికో విద్యార్హత కావాలి. కానీ, ఓ కాంట్రాక్ట్ చెయ్యడానికో లేదా ఒక కర్మాగారాన్ని కట్టుకోవడానికో ఎలాంటి విద్యార్హతలూ అవసరం లేదు. వాటికి కావాల్సిన అర్హతల్లో మొదటిది డబ్బు, రెండోది రాజకీయ పలుకుబడి, మూడోది కులం" ఇక రాజకీయ నాయకుల

గురించి చెప్పిన మాటలు చూడండి." రాజకీయ నాయకులనే వాళ్ళు రెండు తలకాయల శిఖండులటువంటి వాళ్ళు. ఒకేసారి రెండు రకాలుగా మాట్లాడగలరు. బయట మనలాంటి వాళ్ళం చూడడానికి ఒక ముఖంతో ఎదుటి పక్షాల నాయకులతో గొడవలు పెట్టుకుంటూ తిట్టుకుంటూనే మరో ముఖంతో ప్రపంచానికి కనవడకుండా వాళ్ళల్లో వాళ్ళు ఎంతో అన్యోన్యంగా మాట్లాడుకుంటూ వ్యాపారాలు, కాంట్రాక్టులు చేసుకుంటూ కోట్లు సంపాదించుకుంటారు" అని చెబుతూ వెంటనే మరి మనమేం చేస్తామో చెప్పాడు." అన్నీ తెలిసి, తెలిసే మనం మిడతల దండులా వెళ్ళి ఆ రాజకీయ నాయకుల స్వార్థపు మంటల్లో పడి మసైపోతుంటాం."

ఇక రాజకీయ పార్టీల భాగోతం గురించీ వదిలి పెట్టలేదు రచయిత. బీలా ప్రాంతంలో కట్టబోయే పవర్ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా జీవభద్ర తదితర బీల గ్రామాల్లో జరుగుతున్న ఉద్యమానికి ప్రజా బలంతో పాటు రాజకీయ బలం కూడా అవసరమని భావించి ఉద్యమానికి వెన్నూ దన్నుగా వున్న కృష్ణారావు మాష్టర్ ఐదుగురు సభ్యుల బృందంతో హైదరాబాదు వెళ్ళి ప్రొఫెసర్ నందగోపాల్‌ను తీసుకొని అన్ని రాజకీయ పార్టీల అగ్రనాయకులను కలిసి తమ పోరాటానికి మద్దతు తెలిపి సహకరించ వల్సిందిగా అభ్యర్థించిన సందర్భంలో వివిధ పక్షాల రాజకీయ బుద్ధి బట్టబయలు చేశాడు. నిజమైన ప్రజా ఉద్యమాన్ని అంచనా వేసి, సాయం చేయవలసిన పార్టీలు సాయం చేయక పోగా "మీ ఉద్యమం వెనుక వేరెవరో ఉన్నారు. ఆ అజ్ఞాత నిషేధిత రాజకీయ శక్తి వలనే ఇంత కాలం ఉద్యమం నడిచింది" అని అన్ని పక్షాల వారు అన్నారు. "వీళ్లంతా ఒకే తానులో ముక్కలు" అంటాడు రచయిత." పత్రికలు పెట్టుబడి దారుల విష పుత్రికలు" అని శ్రీశ్రీ ఏనాడో చెప్పినట్టు ఈ సందర్భంలో విలేఖరులు వ్యవహరించిన తీరును ఎండగట్టాడు రచయిత. పవర్ ప్లాంటుకి వ్యతిరేకంగా జనాన్ని సమీకరించేందుకు హైదరాబాద్ నుండి వచ్చిన ప్రొఫెసర్ నందగోపాల్‌తో వాగ్వివాదానికి దిగారు. "వెనుక బడిన మా ప్రాంతం అభివృద్ధి చెందాలంటే పరిశ్రమలు స్థాపించాల్సిన అవసరం ఎంతో ఉంది. ఆ విధంగా చూస్తే ఇక్కడకు పవర్ ప్లాంట్ రావడం మంచిదేగా? దేశంలో ప్రతిచోటా మీలాగే పర్యావరణ పాడవుతుందంటూ, ప్రజలు నిరాశ్రయులవుతున్నారంటూ పవర్ ప్లాంట్లు పెట్టకుండా, ప్రాజక్టు కట్టకుండా అడ్డుకుంటూ పోతే ప్రజావసరాలకు కావాల్సిన కరెంట్ ఉత్పత్తి ఎలా జరుగుతుంది? ఆ విధంగా మీరు అభివృద్ధి నిరోధకులుగా మారడం లేదా? చెప్పండి" అంటూ ఒక విలేఖరి ప్రశ్నించాడు. కొందరు విలేఖరులు అప్పటికే ఎం.పి, మంత్రి గార్ల నుండి హీరోహోండా స్పెండర్లను షోరూమ్ నుండే గిఫ్టులుగా అందుకొని, భవిష్యత్తులో పవర్ ప్లాంట్ కాలనీ కట్టేటప్పుడు ఆ పక్కనే తమకూ ఇళ్లు కట్టించి ఇవ్వడంతో పాటు తమ కుటుంబాల్లో ఒక్కొక్కరికి ఉద్యోగం ఇచ్చేలా హామీలు పొందివున్నారు. మరో విలేఖరి "కర్మాగారం పెట్టకముందే ఎందుకూ పనికిరాని బీలా భూములకు లక్షల రేట్లు వచ్చింది గదా? అదే రేపు కంపెనీ కట్టినట్లయితే ఇంకెన్ని రెట్లు భూముల రేట్లు పెరుగుతాయో చెప్పలేం కదా? అప్పుడు చిన్న, సన్నకారు రైతులు తమకున్న ఎకరం రెండకరాలు అమ్ముకొని ఆ డబ్బులతో ఏదన్నా వ్యాపారం పెట్టుకొని హాయిగా బతకొచ్చుగదా? ఫ్యాక్టరీ కడితేనే అందరికీ మంచిది అన్నట్టు సిద్ధాంతీకరించాడు. ఈ సందర్భంలో రచయిత అభివృద్ధి పేరుతో జరుగుతున్న విధ్వంసం గురించి ప్రొఫెసర్ నందగోపాల్ ద్వారా చక్కగా వివరించాడు" – ఆకుపచ్చ బీలను శాశ్వతంగా సమాధి చేసి, ఆ సమాధి మీద అభివృద్ధి పేరు చెప్పి థర్మల్ స్టేషన్ కడతామంటే ఒప్పుకునేదెలా? ఈ బీల, రాతి పొరల కింద సమాధి అయిన తరువాత ఇక్కడి బావుల్లో చెరువుల్లో, వాగుల్లో నీళ్ళుండవు. మీ ఎత్తి పోతల పథకాలు వట్టి వలపోతల పథకాలవుతాయి. చేపల వేట కోల్పోయిన వేలాది మత్స్యకార కుటుంబాలకు వేరే బ్రతుకు తెరువుండదు. ఇక్కడ కట్టాలనుకుంటున్న థర్మల్ స్టేషన్ సామర్థ్యం రెండు వేల నాలుగు వందల అరవై మెగావాట్లు మరి దాని నుండి ప్రతిరోజు పర్యావరణంలోకి నలభై వేల టన్నుల పైచిలుకు బూడిద ఈ చుట్టుపక్కల ఎనభై కిలోమీటర్ల దాకా వెదజల్లబడుతుంది. ఆ బూడిద పడినంత మేర భూముల్లో పంటలు పండవు. దాంతో మనుషులకు, పశువులకు తిండి కరువు వస్తుంది. ఆరోగ్యాలు పాడైపోతాయి. ఇప్పుడీ ప్రాంతంలో మనం చూస్తున్న విదేశీ పక్షులే కాదు, ఆఖరికి ఇక్కడే పుట్టి, ఇక్కడే పెరిగే మన కాకులు, గద్దలు, పిచ్చుకలు కూడా మచ్చుకైనా కన్పించవు" ఇంత చెప్పినా విలేఖరుల తలకెక్కలేదు. బీల భూముల విషయంలో ప్రజల పాత్రను వాళ్ళ ఆందోళనను గురించి రాయకపోగా వారికి వ్యతిరేక వార్తలనే పేపర్ల నిండా రాయసాగారు.

**కార్మిక నాయకుడిగా ఉద్యమాలు చేసిన అనుభవంతో రచయిత ఉద్యమాల గురించి చదువరికి ఆలోచన కలిగించే అంశాలు పేర్కొన్నాడు.'' సామాన్య ప్రజానీకాన్ని భాగస్వాములుగా చేయకుండా ఏ ఉద్యమమూ విజయవంతం కాలేదు. కాబోదు కూడా" అని తాను నమ్మిన సిద్ధాంతాన్ని గట్టిగా చెప్పాడు." సామాన్యులే చరిత్ర సృష్టికర్తలు", అంటూ ఎంతటి ఉద్యమాన్నైనా సామాన్య ప్రజలు పూనితే విజయవంతం చేయగలరని తాను విశ్వసించిన సత్యాన్ని చెప్పాడు.**

కార్మిక నాయకుడిగా ఉద్యమాలు చేసిన అనుభవంతో రచయిత ఉద్యమాల గురించి చదువరికి ఆలోచన కలిగించే అంశాలు పేర్కొన్నాడు." సామాన్య ప్రజానీకాన్ని భాగస్వాములుగా చేయకుండా ఏ ఉద్యమమూ విజయవంతం కాలేదు. కాబోదు కూడా" అని తాను నమ్మిన సిద్ధాంతాన్ని గట్టిగా చెప్పాడు." సామాన్యులే చరిత్ర సృష్టికర్తలు", అంటూ ఎంతటి ఉద్యమాన్నైనా సామాన్య ప్రజలు పూనితే విజయవంతం చేయగలరని తాను విశ్వసించిన సత్యాన్ని చెప్పాడు. ప్రొఫెసర్ నందగోపాల్ మరణవార్త జీవభద్ర ఉద్యమకారులకు విషాదం కలిగించిన సందర్భంలోనూ నిరాశ నిట్టూర్పులు కూడదని ఓ గొప్ప సత్యాన్ని ఉద్బోధించాడు. "ఒక విధంగా చూస్తే నిజమైన ఉద్యమకారుని జీవితం భౌతికంగా

# అలిఖిత జ్ఞాపకం

ఆంగ్లమూలం : Elaine v. Emans
అనువాదం : గోరుగంతుల రాజశేఖర్
9000461295



ప్రతీ ఒక్కరికీ వారి వారి
మధుర స్మృతుల చిట్టా వుండే వుంటుంది.
నా జ్ఞాపకం మీ దానితో కలవకపోవచ్చు
మీ జ్ఞాపకం నా దానితో కలవనూవచ్చు
లేలేత భానుని కిరణాలు
నది ఒంపుల్ని ముద్దాడడం
అనుభూతికి పరాకాష్ఠై
నా మనుసులో తిష్ఠవేసిన ఓ జ్ఞాపకం
మెరిసే పూలగుత్తులు
విరబూసిన అందాలను
తనివి తీరా ఆస్వాదించడం
బహుశా, మీ హృదయాంతరాళంలో
సేదతీరుతున్న చిన్ని జ్ఞాపకం కావచ్చును.
కమ్మని సంగీతంలా
నిత్యం ప్రవహించే నీహార కాంతి
నా జ్ఞాపకాల కిరీటంలో
పొదువుకున్న వజ్రమే !!

రత్నాల్లా వైభవంగా వెలుగులీనిన
అపురూప క్షణాలు
మీ అనుభవాల కాసారంలోను
విచ్చుకొనే వుంటాయి.
అరుదైన ప్రభాత సంధ్యలు, నిశీథి చంద్రికలు
నాకు సొంతమై నన్ను నడిపించాయి.
కనుకొలుకుల్లో స్వప్నాలై
తాండవ నృత్యం చేశాయి
మరపురాని దూరతీరాల్ని
మీరూ నిత్యం ప్రేమిస్తూనే వుంటారు
ప్రకృతి పుట్టిళ్లైన అరణ్యాలు, పర్వతాలు

నా మదిలో పచ్చని జ్ఞాపకాలే !
నేను వాటిని ఆరాధించని రోజే లేదు.
మీ మదిలో చెరగని ముద్రవేసిన
ఎలకోయిల కూజితాలు, పిట్టల కువకువలు
నాకు తెలియకపోవచ్చు
అయినా ఆశ్చర్యంగా
మీ చిట్టా, నా చిట్టాలానే వుంది
ఆ అంతులేని అగాధంలోకి
నేను దూకుతున్నపుడల్లా
అమ్మ చేతి స్పర్శలా సాంత్వన ప్రసాదించి
హృదయ ప్రక్షాళన చేస్తూనే వుంది
అందుకే, ఈ కట్టుబడి జీవితాల్లో
ఆ అలిఖిత జ్ఞాపకాలను
మనఃఫలకంపై పునర్ముద్రించుకుంటే
రేపటి ఎదురీతకి కొండంత అండే మరి !

---

ముగిసిపోయిన తరువాతనే అతని కార్యదక్షత, త్యాగం జనంలోకి చొచ్చుకుపోయి అతణ్ణి శాశ్వతంగా బతికిస్తాయి "అని అంటూ" అంతిమ విజయం ప్రజా పోరాటాలదే" నని ధైర్యం కలిగిస్తాడు..

రచయిత అలవోకగా వాడిన సామెతలు ఈ నవలలో చాలా ఉన్నాయి. ఈ సామెతలు భాషకు ప్రత్యేకతను సంపాదించి పెడతాయి. నవలకు సహజ సౌందర్యం పెరిగింది. సామెతల వలన చెప్పదలచుకున్న భావం ఎదుటి వ్యక్తి హృదయానికి సూటిగా తాకుతుంది. కాంతారావు సామెతలు జనం నిత్యం నిజజీవితంలో ఉపయోగించేవే. ఆయా సందర్భాలకు చక్కగా ఒదిగిపోయి చదువరికి ఆనందాన్ని కలిగిస్తాయి. "కూటికి, గుడ్డకు అక్కరకు రాని" మాటలు, సానుభూతి గురించి అందరూ అనుకునేవేగా. "కన్నతల్లైనా అడగందే అన్నం పెట్టదు" ఎన్నిసార్లు అని వుంటాం మనం. "నిప్పుకు చెదలు పట్టదు", "వెదకబోయిన తీగ కాలికే తగిలిందే", "అరచేతిలో వైకుంఠం", "ముందరికాళ్ళ బంధం" అంటూ పాఠకుడి కాళ్ళకు చుట్టుకొని మరీ నవలను ఆసాంతం చదివించుకుంటాడు. "చెవిటి వాని ముందు శంఖం ఊదినట్లు" కాకుండా "ఇదీ ఒకందుకు మంచిదే" లాంటి సామెతల్ని గుప్పించాడు. "ఎండమావుల్లోన నీళ్ల తాగినట్టు", అంటూ "మబ్బు విడిచిన ఎండను గట్టు తెగిన ఏటిని అడ్డుకునేదెవ్వరు?" అని పాత ముతక సామెతను కాస్తా మార్చి గొప్ప ఔచిత్యంతో కథను నడిపించడంలో రచయిత సఫలీకృతుడయ్యాడు.

ప్రతిభావంతుడైన రచయిత ఊరికే కథను నడిపించక భాషను పండిస్తాడు. ఏదైనా సందర్భోచితానికి భంగం కలుగనంత వరకు పాఠకుడు ఇబ్బంది పడనంత వరకు ఓ.కే..శిరంశెట్టి కాంతారావు పాఠకుల నాడి బాగా పట్టుకున్నాడు. చెప్పదలచుకున్న విషయాన్ని ఎంత చక్కగా ఉపమానాలతో చెప్పాడో కొన్ని ఉదాహరణలు చూడండి. "భూమాత స్తనద్వయంలా అన్పించే రెండు కొండలు కన్పిస్తుంటాయి. "చెరువులోన నీళ్ళు వాలుగుమ్మిన పాయె, నోటిలోనా మాటలు గాలికి పాయె", "రాళ్ళ వానకు ముందు పిడుగు పాటులా", "అరటి బోదె మీద ఒక్కో పోరా వలుచుకుంటూ పోతున్నట్టు", "ఆశల వలతాళ్ళకు చిక్కడం", "అభిప్రాయాల ఆయుధాలు", "మెత్తటి మాటలతో కనబడని కొరడా దెబ్బలు", "పడమటి సూర్యుడు గబ, గబా జాజ్ రంగు మబ్బుల తలుపులు వేసుకొని పశ్చిమ సంద్రపు ఇంటిలోకి జారుకున్నాడు", "భూమి పూజ కోసం ఏర్పాటు చేసిన షామియానాలు మొత్తం, దసరా ఉత్సవాల్లో ఏర్పాటు చేసిన రావణాసురుని కొయ్యబొమ్మల్లా కాలికూలి పోతున్నాయి". "పులిని చూసిన మేకల్లా ఠక్కున ఆగిపోయారు". "ఉట్టి మీద నుండి జారిపడిన కుండ పెంకుల్లా, శవాల దగ్గర నుండి జనమమంతా పరుగులు తీశారు". "వడిశాలతో రాళ్ళు రువ్వినట్టు మాటలు రువ్వింది"– ఇలా ఎన్నెన్నో మాటలు రువ్వుతూ కథా కథనం విసుగు పుట్టించకుండా పుస్తకం ఏకబిగిన చదివే తీరుగా రాయడంలో తన ప్రతిభను చాటుకున్నాడు రచయిత. ఉద్యమ కారులతో పాటు భాషాభిమానులు తప్పక చదవదగిన పుస్తకం "ఆకుపచ్చ విధ్వంసం".



# దుఃఖం నాకో అవ్యాజమైన నేస్తం

- కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి
9948774243



వర్షం వెలిసినా యిల్లు కురుస్తూనే వుంది !
ఇక ఇంటినీ నమ్మలేను !
ఈ వేళ నాకు దుఃఖమే
వో అవ్యాజమైన నేస్తమయింది !

హోరెత్తి ఘోషించే సముద్రాన్ని
నది కౌగిలించుకొన్నట్లు
నేను హృదయాన్ని అలజడెత్తించే
దుఃఖాన్ని ఆలింగించుకొంటాను !
అది నాగుండె తెరమీద ఎన్ని శిథిల చిత్రాలు గీసినా
నా మేధోకుంచను ఆలోచనా రంగుల్లో అద్ది
వో మహా చిత్రాన్ని గీసేందుకుపక్రమిస్తుంటాను !

అర్థశూన్యశబ్దాలు ఆవహించిన నిశ్శబ్దాలు
అగ్నిశ్వాసల్లో భగ్నమౌతూ
ఎర్రబడ్డ అన్వేషణా నేత్రాలు !
దుఃఖోద్వేగాలూ దాహాన్ని తీర్చుకునేందుకు
జ్ఞాపకాల గాయాల్ని తొలుస్తూనే వుంటాయ్ !

కనుగుడ్ల మీద కదిలాడే కన్నీటి చెమ్మను
కనురెప్పలతో పిండుకుంటూ దుఃఖ విముక్తి కోసం
అయిష్టపర్వత శిఖరం మీద 'మినుకు'ను
ఆశాదీపమని నమ్మి
అందుకునేందుకెగ బ్రాకుతుంటాను !
అడ్డదార్ల సూత్రాలు తెలియక
దారితప్పి డీలాపడిపోతుంటాను !
నామనో ఆకాశమంతా రంగులు పులిమిన
దుఃఖపు దారులే ! అదృశ్యపు ఎడారులే !
ఏ రంగు రాస్తా ఎటు పోతుంటుందో
ఏ సుడిగుండాల్లో దూకి అంతమౌతుంటుందో
అంతుబట్టని సందర్భాలు !
ఎన్ని గాయాల సమ్మేళనమో ఈ దుఃఖం !
ఎన్ని దుఃఖాల మిశ్రమమో ఈ జీవితం !
ఏ దుఃఖానిది ఏ రంగో, ఏ వాసనో, ఏ రుచో
ఎవరికి తెలుసు ?
బహుశ : దుఃఖపు గాయాల్ని మోసే చూపుకు తప్ప !
రక్త సంబంధాలు రాగబంధాలు కాకపోయాక
అన్నీ పరాయికరణ చెందిన గాయాలే !
హృదయాకాశాన్ని భళ్లున బద్దలు గొట్టుకొని
పొద్దుటే సూర్యుడనై నేనూ నిద్రలేస్తుంటాను !
కుయుక్తి పాలకుల విభజన రేఖల క్రిందపడి
ఛిద్రమైపోతూ... నేననుకుంటాను
"దేన్ని బతికించేందుకు నేను బతకాలని !
నా అవ్యాజనేస్తమైన దుఃఖమే అంటూంది...
"రైతరికాన్ని బతికించేందుకే
నీవు బతకాలని" !

---

# సుఖ దుఃఖాల క్షణాలు

- భూషి కృష్ణదాసు

చిన్న అడవి పూవుకి రూప
మివ్వడానికి రోజులు
వొకటి వెంట వొకటి వస్తాయి
సుఖదుఃఖాల్లో క్షణాలు
సముద్రపుటలల్లా ఎగిరెగిరి
పడుతుంటాయి
అర్థరాత్రి పుష్పించే మొగ్గలా
ఈ అనంత అద్భుత ప్రపంచంలో



నాకు జన్మనిచ్చిన శక్తియేదో !
ఈ జీవితాన్ని ప్రేమించి నట్టే నేను
మృత్యువునూ ప్రేమిస్తాను
బ్రతుకులోని సుఖసుఖాల్లో సైతం
సముద్రంలా గంభీర ముద్ర
వహిస్తాను

# కవిత్వం ఓ సామాజిక చైతన్యం !

- డాక్టర్ రాధేయ
9985171411



కవిత్వం ప్రతి పంక్తినీ ఊహల ఊయ్యాలలో ఊపడం నేర్పరి తనమే, నేను కాదనను. కానీ ఊహా రాహువు వచ్చి వాస్తవికతా చంద్రుణ్ణి మింగడం నాకు సరిపడని సంగతి. అలంకారాలు జోలికే పోవద్దనడం లేదు. మామూలు సంభాషణలలోనే అలంకారాలు ఉంటాయి. నిజానికి కవిత్వంలో ఏదీ అతిగా వుండకూడదు. వస్తు స్పృహగానీ, వర్ణనగానీ, ప్రచారంగానీ అన్నీ సమపాళ్ళలో వుంటేనే రాణిస్తుంది.

-కుందుర్తి

కవులంతా ఒక్కటే కాదు, కవిత్వమంతా ఒక్కటి కాదు. ఒకే భావంతో కవులంతా ఏకీకృతం కావచ్చు. అభివ్యక్తిలో ఎవరిశైలి వారిది. ఒక్కో కవిత ఒక్కోకోణంలో వైవిధ్య భరితంగా ఉంటుంది. అదే కవిత్వానికున్నంత గొప్పశక్తి. ఎవరిశైలి వారిది ఎవరి శిల్పం వారిది.

కవితా సృజనలో భాష మనస్సులోని భావాన్ని బయటకు వెల్లడిచేస్తుంది. భావాన్ని స్థూలంగా బయటపెడుతుంది. తెలుగులో సాంప్రదాయికంగా ఉండే పద్య లక్షణాలకు ఒదగకుండా, సాధారణ వచనం కంటె భిన్నంగా ఉంటూ ప్రాచుర్యంలోకి వచ్చిన కవితా రూపమే 'వచన కవిత్వం' అని అంటున్నాం. చాలామంది ఆధునికులు కవిత్వాన్ని గురించి తమ కవిత్వంలోనే నిర్వచించారు. ఈ ఆధునిక కవిత్వంపైన విస్తారమైన చర్చలు జరుగుతూ వస్తున్నాయి. మరి కొంతమంది విమర్శకులు శైలీ, రూప, శిల్పాలపై అనేక వ్యాసాలు రాశారు. ఎంత రాసినా, ఎన్నిచర్చలు చేసినా ఎప్పటికప్పుడు వినూత్న ప్రక్రియలు, వాదాలు, పేరుతో ఆధునిక కవిత్వం నిత్యనూతనత్వాన్ని సంతరించుకుంటూ వినూత్న శైలీ విన్యాసాలతో అనంత ప్రవాహమై సాగిపోతూ ఉంది. 1960వ దశాబ్దం నుండి వచన కవితా వ్యాప్తితో పాటుగా కవిత్వాన్ని గురించి అనేక చర్చలు వాదోపవాదాలు మొదలైనాయి.

సమాజ ప్రకృతికి భాష సహజంకాగా, భాషా సంబంధమైన ఒక కళగా సమాజంలో కవిత్వం పుట్టింది. భావావేశ పూరితంగా కవిత్వం వెలువడుతుంది కాబట్టి దానిలో లయాత్మకత సహజంగా ఉంటుంది. అందుచేతనే ప్రాచీనులు "గద్యం కవినాంనికషం వదంతి" అన్నారు. వచన కవిత్వం ఆంగ్ల సాహిత్యం నుంచి కూడా స్ఫూర్తి పొందిందని చెప్పవచ్చు.

వచనకవితను ఒక ఉద్యమంగా కుందుర్తి ఆంజనేయులు ప్రకటించి, ఈ ప్రక్రియను విస్తృతంగా ప్రచారం చేసి యువకులను ప్రోత్సహించిన ఘనత వారికే దక్కుతుంది. అది రాను రాను మరింత విస్తృతమై ఆధునిక కవితగా, అత్యాధునిక కవిత్వంగా పరిణామం చెందుతూ వచ్చింది.

ఈ పరిణామక్రమం విస్తృతంగా రాస్తున్న ఈనాటి తరం కవిత్వాన్ని గురించి తమ దైన శైలిలో స్పందిస్తున్నారు. కవిత్వానికి కాలం చెల్లిందంటున్నారు. కవిత్వానికి కాలంగాదంటున్నారు నాకంతటా కవిత్వం కదలాడుతుందేమిటి? నాలో ప్రతిదీ కవిత్వంగా పరివర్తన చెందుతుందేమిటి? చేయిచాచి వేళ్ళకేసి చూచుకుంటే కవిత్వం కళ్ళు మూసి నుదుటినదిని చేత్తో పట్టుకుంటే కవిత్వం. అడుగుదీసి అడుగేయటంలో కవిత్వం అంటున్న ఈ కవి –

"బోర్లాపడుకుని భూమిని వాటేసుకుంటే కవిత్వం / రెండు చేతుల్నిండా దుమ్ముతీసుకొని నెత్తి మీద పోసుకుని / జలకాలాడ్డం కవిత్వం / అగ్గిపుల్ల గీయటం కవిత్వం / ఎదురు బద్దని వంచి విల్లంబు చేయటం కవిత్వం / నేనో వాహకం / నారక్తంలోంచి దూసుకొచ్చిన ప్రపంచమంతా కవిత్వమే / నా చూపుతో ముట్టుకున్నదీ, నా చేత్తో ముట్టుకున్నదీ / నా దేహంతో ముట్టుకున్నదీ కవిత్వమే / గాలి గాలంతా కవిత్వమే / భూమి తనువంతా కవిత్వమే /"

– కె. శివారెడ్డి

కవిత్వం కావాలి. అది పద్యం కావచ్చు గద్యం కావచ్చు అది గేయం కావచ్చు గీతం కావొచ్చు. ఛందోబద్ధ నిరుపయోగ పాదాలకు విలువలేదు. వస్తురూప రహితమృత కావ్యాలకు చోటులేదు అర్థశూన్య ఆడంబర శబ్దాలక్కర్లేదు అంటున్న ఈ కవి–

"కవిత్వమెప్పుడూ కాలంతో మారాల్సిందే / స్థలం ప్రతిబింబించాల్సిందే

/ బహు ముఖాలుగా మాట్లాడేది కవిత్వం / బతుకు వంకరతనం బయట పెట్టేది కవిత్వం / బడుగు జీవికి బాసటయ్యేది కవిత్వం / భాషను ఆయుధంగా మార్చేది కవిత్వం /"

**– నన్నపనేని రవి**

ఏది కవిత్వం? కవిత్వమెలా వుడుతుంది ? హృదయానుభూతులు ఎలా బహిర్గతమవుతాయి ? ఈ ప్రశ్నలకు సమాధానమే ఈ కవయిత్రి కవిత్వం –

"అంతరాత్మలోని ఓ భావన / సుడులు తిరిగి / హృదయానుభూతుల జడులలో తడిపి / పెదవులపై సుడులుగా వెలువడితే / ఆ తడి అలజడి / ఆ కన్నింటి అలలసవ్వడే / కవిత్వం /"

**– జ్యోత్స్న**

కవిత్వమంటే ఏమిటి ? కవిగా బతకడమంటే ఎలా? ఊట కొత్త అనుభవాల సమాహారం, నేల గుండెతడి ప్రవాహం. అక్షరాల జల అక్షరం అక్షరానికి జతపడనిదే పదానికి ప్రాణం రాదు. ఆలోచన అనుభవంగా పదునెక్కనిదే సాకారం కాదు అంటున్న ఈ కవి–

"ఓ నాలుగు కొత్త పదాలు ఒగ్గరీ / నాల్గు ప్రతీకల హెచ్చవేతా / కవిత్వం కాదు / కవిత్వాన్ని జీవితంగా అనుభూతించు / గాయపడు / గాయాల్ని కవిత్వంతో తుడుచుకో / గాయాల స్పర్శతోనే / కవిత్వం ఔషధ సాధకమౌతుంది / కవిగా బతకడమంటే / కవిత్వంగా బతకడమే /"

**– వఝల శివకుమార్**

మన కవిత్వం శ్రమజీవుల చేతుల్లో జెండాగా ఎగరాలి. పీడితుల గుండెల్లో నాదమై ప్రతిధ్వనించాలి. గోడల మీద అక్షరాలై ప్రజ్వలించాలి. పత్రికల్లో పతాకశీర్షికై నిలవాలి. కరపత్రాలకు కరదీపికై వెలగాలి అంటున్న ఈ కవి–

"కవిత్వం జీవితమంత విస్తృతం / జీవితం కవిత్వమంత సుందరం / అనుభూతి కవిత్వానికి ధాతువు / అభివ్యక్తి నిర్విరామ సేతువు / ప్రజల బాధ మన కవిత / ప్రజల భాష మన కవిత / ఆవేదన ఆందోళన / ఆగ్రహాలకు అక్షరాయుధం మన కవిత /"

**– డా॥ ఎస్వీ సత్యనారాయణ**

మనసు పాదులో కరిగిన మట్టి పొరలున్న చోటే కవిత్వం పొటమరిస్తుంది. ఆవిష్కృత సాకారసత్యంలా అక్కడ హరిత కల్పన పుష్పిస్తుంది. సమకాలీనత రేకులు తొడిగిన స్వచ్ఛంద కవిత్వంలా పరిమళిస్తుంది అంటున్న ఈ కవి –

"కవిత్వం కావాలంటే / నక్షత్రాల విపణుల్లోకి వెళ్లనక్కరలేదు / డాలర్ల గడ్డను తవ్వనక్కరలేదు / ఖండాంతర గ్రంథపంక్తుల వీర్యకణాలను కొనితెచ్చి / అత్యాధునికంగా వారు పోసుకుని / ఇక్కడి కలం లోంచి ప్రసవించనక్కరలేదు / అక్షరం ఉదయించాలి / ఒంటి మీది చెమట బిందువులా / కవిత్వం ప్రసరించాలి / ప్రాణవాయువుల్లో స్నానం చేసి కురులార్చుకునే / ప్రభాతకిరణంలా /"

**– డా॥ సి. నారాయణరెడ్డి**

మిత్రమా కవిత వున్నప్పుడే నవత రాణిస్తుంది. అసలు కవితలోనే నవత కూడా వుంది. కవిత్వంలో అబ్స్క్యూరిటీ కొన్ని సందర్భాలలో వుండొచ్చును. కాని, పాఠకుడికి నీ అనుభూతి ఆకారం అందాలి హత్తుకోవాలి. అది ట్రాన్స్ పరెంట్ చీకటై వుండాలి. నిన్ను పలకరించాలి అంటున్న ఈ కవి –

కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరవాలి / కదిలించాలి / ప్రతి మాటకీ శక్తి వుంది, పదునువుంది / ప్రతి చిత్రణకీ అర్థం వుంది, ఔచిత్యం వుంది / గులకరాళ్ళ డబ్బా మోగించి గొప్ప సంగీతం అని దబాయించకు / అంత్య ప్రాసలు వేసినంత మాత్రాన ప్రొసైక్ భావం పొయిట్రీ అవదు / కవిత్వం ఒక ఆల్కెమీ దాని రహస్యం కవికే తెలుసు / ఈ కాలంలో బ్రతుకు, యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు / నువ్వు చెప్పేదేదైనా నీదై వుండాలి. నీలోంచి రావాలి – చించుకొని రావాలి /"

**– తిలక్**

అనగనగా అగ్గిపుల్ల. దానిపేరు కవిత్వం వేడితోపాటు వెలుగునూ ప్రసరిస్తుంది. కొండొకచో మార్గదర్శనం చేస్తుంది. ఎంతకాలంగా రాస్తున్నా మళ్ళీ సరికొత్తగా వుంటుంది. శబ్దాన్ని ఎక్కడి నుంచి తీసుకోవాలో, ఎక్కడ నిక్షిప్తం చెయ్యాలో తెలియక బాలశిక్షలోకి నెట్టేస్తుంది అంటూ తన కవితానుభావాలను తెలియజేస్తున్న ఈ కవి –

"కనిపించే దృశ్యాల వెనుక / కనిపించని చరిత్ర / ఎప్పటికప్పుడు / స్ఫూర్తిని వెలిగించే / గైడు లాంటివాడు కవి / అందరూ నిద్రపోతుంటే / కవి ఒక్కడే మేల్కొని వుంటాడు / లోకం పైన / ఒక ప్రేమాంచల / విరాట్ వస్త్రాన్ని కప్పే తండ్రి లాంటి వాడు కవి / కవిత్వం రాస్తుంటే / కలంలో సిరామట్టం తగ్గుతుంది గాని / సముద్ర మట్టం మాత్రం / పెరుగుతుంది /"

**– డా॥ ఎన్. గోపి**

కవిత్వం నాకన్నతల్లి, ఏడుపొచ్చినా, నవ్వొచ్చినా అమ్మనే స్మరిస్తాను. కవిత్వం నా బాల్యం. సజీవ జ్ఞాపకాల్ని స్మరించుకుంటూ గాయాల పొత్తిళ్ళలో విశ్రమిస్తాను అంటూ కవిత్వాన్ని తల్లి భాషగా ఆవిష్కరించుకొంటున్న ఈ కవి –

"కవిత్వం నాభాష / ముఖమ్మీద చిరునవ్వుగా / జీవితాన్ని ఆవిష్కరించుకుంటాను / కవిత్వం నా శ్వాస / నిట్టూర్పు సైతం నిషేధమైనపుడు / దుఃఖాశ్రువునై స్రవిస్తాను / కవిత్వం నా ఆయుధం / తల్లి భాషలో నన్ను నేను ఆవిష్కరించుకునే ముందు మాటే కవిత్వం /"

**– డా॥ బీరం సుందరరావు**

కవిత్వం ఒక అగ్నిధార, ఒక రసవిద్య, ఆ కవిత్వ ధారను రసవిద్యను స్వంతం చేసుకున్న అరుదైన కవుల్లో శేషేంద్ర ప్రముఖులు. కవిత్వం మనిషి యొక్క భావాత్మక శరీరం కోసం పుట్టిన అమృతరూప ఆయుర్వేదం అని తెలయజెప్పిన మహాకవి శేషేంద్ర వారి మాటల్లోనే –

"నదులు కవులు భూగోళపు రక్తనాళాలు / నదులు ప్రవహిస్తాయి కవితల్లా /
పశువుల కోసం పక్షుల కోసం మనుషుల కోసం / నదులు కనేకలలు

# పాడవే కోయిలా ....!

జి. రాజకుమారి
9490099008

పాడవే కోయిలా....!
తేనెసోనియ లొలుకు తెలుగు గీతికా...!
మనసుకు ఒక మనసే అందమనీ
అది నీ ఆశయ దీపికనీ...
మనసు విప్పి మధురముగా
హాయిగొలుపు ఆ గీతికా...



గుండె గొంతుకలో చిక్కుపడితే
సుజ్ఞాన కాంతి నింపుతూ
కరిగే వెన్నంటి నీ మనసుతో
కలిసి పాడవే కరుణాల కోయిలా...
తేనె సోనియలొలుకు
తెలుగు గీతికా...!

---

ఫలిస్తాయి పొల్లాల్లో / కవులు కనే కలలు ఫలిస్తాయి మనుషుల్లో / నేను కవితల్ని నా హృదయ పంజరంలో / ఉంచి పెంచుతాను ముద్దుగా /
ముత్యాలు ఆహారంగా వేస్తాను / ఒక్కొక్కప్పుడు కన్నీటి ముత్యాలు /"

– శేషేంద్ర

ఒక కవిత రాయడం కాదు. దాన్ని దర్శించాలి. ఏ సముద్ర తరంగాల నురుగు మీదనో, కొండల మీద రాజు కుంటున్న వసంతంలోనో, దైనందిన దేహానుభవాల తడిపిన ఏ పిడికెడు మట్టిలోనో కవిత్వాన్ని దర్శించాలి అంటున్న ఈ కవి –

"ఒక కవిత నీ కోసం దిగివచ్చేటప్పుడు ఆకాశంలో / కిరణాలు మరింత వన్నెతీరతాయి నదుల్లో / జలాలు మరింత తేటపడతాయి. గోదావరి ఒడ్డున / రసజ్ఞులకొక పూర్వ పద్యంలో కొత్త అర్థం స్ఫురిస్తుంది / కవిత స్వర్గంలో ఉన్నప్పుడు చుట్టూ హంసలు / బారులు తీరతాయి. ఇప్పుడు నీ కోసం ఈ / దుమ్ములో అడుగుపెడుతున్నది. ముందు నీ / గుండె చీల్చు, ఆపైన శ్రోతల గుండె చీల్చు /"

– వాడ్రేవు చినవీరభద్రుడు.

కవిత్వం ఎక్కడో రసైక్య సిద్ధిలో అనంతానందవార్ధిలో విస్తారంగ నిగూఢశాంతిలో వికసించిన మొగ్గ. దాపుకొస్తున్న మృత్యువు అడుగుల సవ్వడిలో కలిసిపోయిన మధురోహల కలకలం. కాలకుంతలాలలో వురి పోసుకున్న ఆశపువ్వు విరిగిన కలే కవిత్వం అంటున్న ఈ కవి –

"ఆగిపోతున్న కంఠంలో / ఆఖరి చరణంలో వొణికిన అపశృతి / శూన్యంలోకి సంధించిన / చివరి చూపులో వొలికిన నిర్లిప్తత / శ్మశానం పెదవులపై / చెరగని యెర్రటి చిర్నవ్వు / నీడా తోడు కూడా లేని
నిబిడాంధకారంలో / నా అస్తిత్వం కల్పించుకున్న / వొకే ఒక నేస్తం కవిత్వం /"

– కె. యెస్. రమణ

ఇప్పుడు నువ్వు కవితా సౌందర్యవేటగాడివై పోతావు. కవితారవిందాల. అందాల బంధాల విచిత్ర ప్రబంధంలో నీవొక వినూత్న విన్యాస పదప్రయోగశాలవై పోతావు. అక్షరం, భాష సాహిత్యం చరిత్ర వారసత్వం అన్నీ నీకోసమే వుండాలనుకుంటావు. ఉద్యమ సృష్టికి ఉత్తేజ కవిత్వం కాలేక పోతావు అంటున్న ఈ కవి –

"కవిత్వమే సమస్త స్వీయ ప్రపంచమనుకునేవాడు / వాస్తవ ప్రపంచపు నడకలో దాగిన / కవిత్వ కీర్తి ముద్రలు కానలేక / నడుస్తున్న చరిత్ర భుజాలపైన వాటిని వెతుక్కుంటాడు / ప్రియ కవి మిత్రమా / విల్లు పట్టిన వాడల్లా గురికాడు కాడు / సాహసం లేని వాని నిఘంటువులో విజయం లేదు / కవితాపుష్పానికి కవిత్వం పూయదు / మట్టి జీవితానికే పూవు పూస్తుంది /"

– దివి కుమార్

పువ్వులన్నీ ఒక్క చోట చేరినప్పుడల్లా ఒక నవోద్యమం నవనవలాడుతుంది. కవిత్వం కొత్త పోకడలు పోతుంటుంది. కవిత్వం లాగే ఇల్లు రాకపోకలకు రహదారి కావాలి. పాతనీటిని పారద్రోలే ప్రవాహం కావాలి. ఉద్యమ ఒరవడిలో అలసిన వీరుడికి విడిదికావాలి. అంటున్న ఈ కవి –

"ముడుచుకుంటే కవిత్వమెలా పలుకుతుంది / అనేక దేహాలుగా / లక్షలాది కళ్ళుగా తెరుచుకో / జీవం ఒళ్ళు విరుచుకుంటుంది /" కవిత్వం పరవళ్ళు తొక్కుతుంది /"

– స్మైల్

ఇవీ కవిత్వ నిర్వచనాలు. కవిత్వంపై కవుల భావోద్దీపనలు కవుల అస్తిత్వ ప్రకటన ఆధార దృశ్యాలు. తనదైన భాషలో తన్ను ఆవిష్కరించుకునే అద్భుతమైన సాధనం. ఈ సమాజంలో ఈ మనుష్యుల్లో ప్రతిఫలంచే కలల సంకేతాలు. ప్రతి అక్షరానికి శక్తి, పదును ప్రతిఫలిస్తుంది. ఈ విశాల విశ్వంపై ఒక. ప్రేమాంచల విరాట్ స్వరూపం కవిత్వమే. అది చెమట బిందువుల్లా ప్రసరించి ప్రాణవాయువు కావాలి. గాయాలు, జ్ఞాపకాలు ఈ కవిత్వంలో భాగమే. ఉద్వేగాలు, ఉద్రేకాలూ, విప్లవాలు ఈ కవిత్వంలో మమేకమే. అసలు జీవితానికి పతాక శీర్షిక ఈ కవిత్వమే తమ హృదయాలను కవితలుగా నిక్షిప్తం చేసి, నిర్వచించిన ఈ కవుల సమూహానికి కన్నీళ్ళతోనూ, ఆనందభాష్పాలతోనూ చేతులు జోడిస్తున్నాను. ఈ భూమి తనువంతా కవిత్వమై అల్లుకుపోవాలి. నాగరిక నిర్మాణానికి నవ్య మార్గాలు వేసే అపురూప దృశ్యాలు కావాలి కవిత్వం. ఇదీ నా దృష్టిలో కవిత్వం ఓ సామాజిక చైతన్యం. ఈ విశ్లేషణలన్నీ అందులో భాగమే.



# అత్యాచార భారతం

- ఆవుల బసప్ప
9985922151

స్త్రీని గౌరవించాలన్న సాంప్రదాయం
మానవీయ విలువలకు నిలయమైన నేల
నేడు అత్యాచార అకృత్యాలు నిత్యకృత్యం
పసిమొగ్గల్ని చిదిమేసే మృగాళ్ళ పైశాచికత
హృదయాలను పిండేస్తుంటే
ఎటు వెళ్తుందీ సమాజం ?
ఎక్కడ నాటి విలువల సాంప్రదాయం ?
విలువకు పురుడు పోయాల్సిన
కుటుంబం, విద్యాకేంద్రం, పౌరసమాజం
బాధ్యతారాహిత్యం
నైతికత నేర్పాల్సిన విద్య వ్యాపారమైతే
అవి మానవత్వం, మర్యాద నేర్పే తీరికలేక
మార్కుల కార్ఖానాలలో బంధీలు
నవీనత, స్వేచ్ఛలకు ధ్వంసమైన ఉమ్మడి కుటుంబం
మనుషుల మధ్య అనుబంధాలు మనీబంధాలై
వ్యక్తుల బలహీనతే పెట్టుబడిగా
సినిమాలు, వ్యాపార ప్రకటనలు, అంతర్జాలం



సెల్‌ఫోన్ మెమొరి కార్డుల్లో బుసకొడుతున్న అశ్లీలత
మత్తు పదార్థాలు, మాదకద్రవ్యాల్లో జోగుతున్న
ఉన్మాద ప్రపంచీకరణ మృగం
భారతీయతను ధ్వంసం చేస్తున్న నగ్న దృశ్యం
అదే అత్యాచార భారతం
గరళీకరణకు బలౌతున్న భారతీయ వనిత

---

# అతడు... అక్కడే...

- వి. వెంకట్రావు
9247235401

అతడు... అక్కడే... సప్త సముద్రాలకీ ఆవల
శ్వేత వర్ణపు మర్రిచెట్టు తొర్రే అతని నివాసం
చేతులు మాత్రం మాగ్రామ పొలిమేరల్లో
బిగించిన పిడికిలి వికటాట్టహాసం చేస్తున్నది
వేళ్ళ సందుల్లో నుండి జారిపోయిన మంచినీళ్ళు
నన్ను చూసి వెక్కిరిస్తున్నాయి.
ట్రాన్సపరెంట్ కన్నీళ్ళూ, రక్తవర్ణపు మట్టిలో ఇంకి
ఆకుపచ్చని మొక్కలు మొలుస్తున్నాయి
పుష్పించిన ఓ పువ్వు వాడికేసి చూసి,
వాడి కళ్ళలో మెరుపును చూసి ఆనందంతో గంతులేస్తుంది
దోరమామిడి పళ్ళ నిగనిగల్లో
తన వికృతాకారాన్ని చూసుకుని ఎంత నవ్వో
కన్నతల్లిని తొక్కేస్తున్నానన్న కోపమో, ఏమో
నా ఆక్రందనలు వినిపించుకోకుండా
మాటలన్నీ వాడి వైపే మాట్లాడుతూ.. నన్ను మాత్రం ఆటపట్టిస్తుంది.
భూమి దగ్గర నుండి పావలా అప్పు తీసుకున్న నక్క
ఎక్కడికి పారిపోగలదు.
భూమి నాదియన్న భూమి ఫక్కున నవ్వేను
నవ్వులన్నీ, పువ్వులై ఒళ్ళో పడుతున్నాయి



కళ్ళతోనూ, నోటితోనూ రిమోట్ కంట్రోల్ చెయ్యగలశక్తి వాడిది
మట్టి తల్లీ నువ్వు వాడివైపేనా
పర్యావరణ మంతా మట్టి కొట్టుకుపోయింది
గాలి కలుషితమై పోయింది
వాడికేం ప్రత్యేకమైన ఆక్సిజన్ ఉంటుంది
నీరు కలుషితమై పోయింది
మినరల్ వాటర్‌తో స్నానం..
వాడెక్కడ
అతడు... అక్కడే.. సముద్రాలకి ఆవల

# అద్భుత జీవన కావ్యం - పథేర్ పాంచాలీ

- డా. ఆలూరి విజయలక్ష్మి

9894902244l



**గ్రామ సీమల నుండి పట్టణాలకు, పరాయి ప్రాంతాలకు తరలి పోవడాలు, ఆ క్రమంలో తారసిల్లే పెనుకుదుపులు బ్రతుకుల్ని అతలాకుతలం చెయ్యడం, అంతలోనే ఆశాలేశాలు కొంత కాంతిని ప్రసరించడం... కథలోని పాత్రల వెంట తెలియకుండానే తరలిపోయే మన మనుసుల్ని కదిపి, కళ్ళను చెమ్మతో నింపే శైలీ సౌందర్యం రచయిత స్వంతమవడం వలన ఇంత గొప్ప నవలల సృష్టి జరిగింది.**

విశ్వవిఖ్యాత చలనచిత్ర భారతీయ దర్శకుడు సత్యజిత్‌రే మొత్తం ప్రపంచం దృష్టిని భారతీయ సినిమా వైపు తిప్పేలా చిత్రీకరించిన దృశ్యకావ్యాలు, పథేర్ పాంచాలీ (1955), అపరాజిత (1956) అపూర్ సంసార్ (1959). ఈ చలన చిత్రాలకు ఆధారం ప్రసిద్ధ బెంగాలీ రచయిత బిభూతి భూషణ్ బందోపాధ్యాయ రాసిన రెండు అద్భుతమైన నవలలు 'పథేర్ పాంచాలీ', 'అపరాజితో'. పథేర్ అంటే పథం లేక రహదారి మార్గం, 'పాంచాలీ'లు కథాగానానికి ఉపయోగించే బెంగాలీ గీతాలు.

జీవన పథంలో ఎన్నో మలుపులు, ప్రతి మలుపు దగ్గర ఎన్నో ఉత్సాహాలు, ఉత్తేజాలు, నిరాశలు, హృదయం బ్రద్దలయే విషాదాలు. పథం పొడుగూతా ఎన్నో సంతోషాల బొడ్డు మల్లెలు, కష్టాల కరకుముళ్ళు పరచుకునే వుంటాయి. వీటితో నిమిత్తం లేకుండా పథం ముందుకు సాగిపోతూనే వుంటుంది. బ్రతుకు నడుస్తూనే ఉంటుంది. ఎన్నో ఒడిదుడుకుల్ని, ఇబ్బందుల్ని ఇక్కట్టుల్ని మోస్తూనే చిన్ని చిన్ని ఆనందాల కోసం వెదుకుతూ, దొరికిన ప్రతి స్వల్ప సంతోషానికి పులకరించిపోతూ, కష్టాలను సాహసంతో ఎదుర్కొంటూ బ్రతుకు సాగుతూనే వుంటుంది. ప్రకృతిలో మమేకమయి జీవిస్తున్న వ్యక్తులు మంచి బతుకు కోసం, మంచి అవకాశాల కోసం గ్రామ సీమల నుండి పట్టణాలకు, పరాయి ప్రాంతాలకు తరలి పోవడాలు, ఆ క్రమంలో తారసిల్లే పెనుకుదుపులు బ్రతుకుల్ని అతలాకుతలం చెయ్యడం, అంతలోనే ఆశాలేశాలు కొంత కాంతిని ప్రసరించడం... కథలోని పాత్రల వెంట తెలియకుండానే తరలిపోయే మన మనుసుల్ని కదిపి, కళ్ళను చెమ్మతో నింపే శైలీ సౌందర్యం రచయిత స్వంతమవడం వలన ఇంత గొప్ప నవలల సృష్టి జరిగింది.

అడవి పూల పరిమళం, నదీ జలాల సంగీతం, వెదురు పొదల ఊసులు, మబ్బు కన్నెల సయ్యాటలు, పేదరికపు అవమానాలు, ఆకలి దైన్యాలు, నాగరికతా రైలు మార్గాలు గ్రామాల గుండెల్లోకి దూసుకొచ్చినప్పుడు జన హృదయాల్లో జనించే కుతూహలం, భయం, సంక్షోభం, అభివృద్ధి రెక్కలు మోసుకొచ్చే పరిణామాల గురించి ఆశ నిరాశలు, ఉన్న జీవితం కూడా జారిపోతుందేమోననే కలవరాలు, మెరుగైన జీవితాన్ని పొందాలనే ఆకాంక్ష, మానవ జీవితపు సంవేదనలు మన కళ్ళముందు సజీవంగా సాక్షాత్కరించి కథతో, పాత్రలతో సన్నిహితమయిపోయి పాత్రల తాలూకు అనుభూతులనన్నిటినీ మనం కూడా అనుభవించేలా చెయ్యడమే ఈ నవలల వైశిష్ట్యం. "కాలమూ, జీవితమూ ముందుకే సాగుతుంది కాని వెనక్కురాదు, అందుకే వీటిని అత్యంత అపురూపంగా, జాగృతిలో, జాగురూకతతో వినియోగించుకోవాలి" అనే మెలకువను కూడా కలిగిస్తాయీ నవలలు. కథ మన ఇంటి ప్రక్కనే ఏదో కాలంలో జరిగినట్లే అనిపిస్తుంది. కథకు మన నిజ జీవితానికి సారూప్యమేదో ఉందని

అనిపిస్తుంది.

హరిహరరాయ్, అతని భార్య సర్వజయ, కూతురు దుర్గ, కొడుకు అపూర్వరాయ్.... వీరే ముఖ్యపాత్రలు. నిశ్చిందిపురం గ్రామం, రకరకాల పళ్ళ తోటలు, సోనాడాంగా మైదానం, హరి హర రాయ్ ఇంటి చుట్టూ ఉన్న అడవి, ఇచ్ఛామతి నది... దుర్గ అపూల హృదయాల్ని ఉత్తేజితం చేసే ప్రకృతి స్పర్శ ఇక్కడిదే. తూర్పు బెంగాల్‌లోని అభివృద్ధి సెగతాకని నిశ్చిందిపురంలో దుర్భర దారిద్ర్యంతో బ్రతుకునీడుస్తున్న హరిహరరాయ్ కుటుంబానికి అదనపు భారం అతని దూరపుబంధువు, వరుసకు సోదరి ఇందిరమ్మ. చిన్నతనంలోనే భర్తను, కూతుర్ని కోల్పోయి ఒంటరిగా, పేదరికంతో బ్రతుకుతున్న ఇందిరమ్మను సర్వజయ సూటిపోటీ మాటల్లో ఈసడిస్తుంది. ఇందిరమ్మకు దుర్గ, అపూ అంటే అమితమైన ప్రేమ, ఆపేక్ష, ఆప్యాయత, చివరకు జబ్బు పడినప్పుడు సర్వజయ కాస్తంత కనికరం లేకుండా ఇంటినుండి వెళ్ళగొట్టిన కారణంగా అతిదయనీయ స్థితిలో వీధిలోనే దిక్కులేకుండా ఆమె మరణించింది.




పీచురేగిన జుట్టుతో, దుమ్ముకొట్టుకున్న కాళ్ళతో ఎప్పుడూ ఇష్టం వచ్చినట్లు తిరుగుతూ, ఎవరెవరివో తోటల్లో మగ్గిన రేగుపండ్లనూ, మామిడి పిందెల్నీ, వాకుడుపళ్ళనూ మూటకట్టుకుని తెచ్చుకుని తల్లికి తెలియకుండా తమ్ముడితో కలిసి తినడం, మేనత్త ఇందిరమ్మ చెప్పే కథల్ని ఇష్టంగా వినడం, చెట్లంటా, పుట్టంటా తమ్ముడు అపూను వెంటేసుకుని తిరగడం... ఇదీ దుర్గ దినచర్య. మంచి రుచికరమైన తిండికి ముఖంవాచి ఎవరేం పెడతారా అని ఇంటింటికీ తిరగడం, వాపిరి గొట్టులా తినడం, ఇలాంటి స్థితిలో కూడా తనకు దొరికిన వాటిని చిట్టితమ్ముడికి పంచడం ఇదే దుర్గ వ్యాపకం.

ఇంగ్లీషురాని హరిహరరాయ్ పశ్చిమ దేశానికి వెళ్ళి బెంగాలీ, సంస్కృత భాషల్లో కావ్యాలు, శాస్త్రాలు నేర్చుకుని వచ్చాడు. చిన్నవయసులోనే పెళ్ళిచేసుకుని పుట్టింట్లోనే వదిలేసివెళ్ళిన భార్యను తెచ్చుకుని నిశ్చిందిపురంలో కాపురం పెడతాడు. అతని చదువుకు తీరైన ఉద్యోగాన్ని తెచ్చిపెట్టగల శక్తిలేదు. చివరకు మరే దిక్కులేక పౌరోహిత్యాన్ని ఎంపిక చేసుకున్నాడు. అయినా బ్రతుకు వెళ్ళమారక ఇతర ప్రాంతాలకు వెళ్ళి పదీ పరక సంపాదించి అప్పుడప్పుడూ ఇంటికి వస్తూపోతూ వుంటాడు.

బిడ్డలతల్లి అయాక, ముఖ్యంగా అపూ పుట్టాక సర్వజయ ప్రాణాలన్నీ వాళ్ళమీదే. కాస్త మంచి తిండి అయినా బిడ్డలకు పెట్టలేకపోతున్నామే, వాళ్ళ చిన్ని చిన్ని సరదాలు తీర్చే తాహతుకూడా తమకు లేదే అని ఆమె కుమిలిపోయేది. అపూ బోసినవ్వులు, చిలిపి చేష్టలు, ముద్దుమాటల్లో ఆమె దుఃఖం ఎగిరిపోయేది.

చూడగానే ఆకర్షించే అందంతో, అమాయకత్వం ఉట్టిపడే ముఖంతో, నడక నేర్చినప్పటి నుండి అమ్మతో దాగుడుమూతలాడడం, అక్కతో కలిసి పండ్ల తోటల వెంట తిరుగుతూ పండ్లను కోసుకు తినడం, కూరగాయల్ని తెచ్చి అమ్మకు ఇవ్వడం అపూకి ఇష్టమైన వ్యాపకాలు. పండ్లు, కాయలు దొంగతనంగా తెచ్చుకున్నప్పుడు తోట యజమానుల ఆగ్రహం, తల్లి దండన, ఇంట్లో అన్నీ నిండుకున్నప్పుడు కేవలం మరమరాలు, నీళ్ళతో కడుపు నింపుకుని కాలక్షేపం చెయ్యవలసి రావడం... ఇవేవీ అపూ, దుర్గల జీవనోత్సాహాన్ని ఆపగలిగేవి కావు. అపూకి అక్కంటే ఎంతో ఆపేక్ష.

మానవీయ బంధాల్ని చంపేసే పేదరికం ఒకప్రక్క దుర్బలపరుస్తున్నప్పటికి, అంతటి నిరాశా పూరితస్థితిలో కూడా ప్రేమల్నీ, ఆప్యాయతల్నీ, ఆత్మగౌరవాన్నీ నిలుపుకున్న కుటుంబం మనసు కుదుపుతుంది. బడిలో పంతులుగారు తన స్వంత చరిత్రను కథలు కథలుగా చెప్పడం, ఆయన్ని కలవడానికి వచ్చేవారు కూడా కబుర్లను కథలుగా చెప్పడం అపూను కథల మోహంలో ముంచడానికి దారితీసాయి. వారి మాటల్లో ప్రస్తావనకు వచ్చే రైలు ప్రయాణం, మంత్ర తంత్రాల గారడీ కబుర్లు, దారి దొంగల్ని సాహసంతో ఎదిరించే ఘట్టాల్ని విన్న అపూ మనసు ఊహల్లో తేలిపోయేది.

ఒకసారి అపూ తండ్రి వెంట వేరే ఊరువెళుతూ రైలురోడ్డును చూసేడు. ఇనప స్థంభాలు, వాటికి కట్టిన తంతుల మీదుగా వార్తలు దూరప్రాంతాలకు ప్రసారమవుతాయని తెలిసి విభ్రమం చెందాడు. ఇంటికి తిరిగి వచ్చాక అక్కకు, అమ్మకు, స్నేహితులకు రైలురోడ్డు గురించి కథలు కథలుగా వర్ణించి చెప్పాడు. చెట్లు, మైదానాలు, ఏటి ఒడ్డు వెంట తిరుగుతూ బ్రతుకు తాలుకు, బాల్యం తాలూకు ఉత్సవ సంరంభాన్నంతటినీ మనసారా అనుభవిస్తున్న అపూ కథల ప్రపంచంలోకి అడుగుపెట్టి రామాయణం, మహాభారతం కథల్ని, సాహస గాథల్ని చదువుతూ తనను ఆ కథలలో ఒక పాత్రగా ఊహించుకునేవాడు.

ఉన్న ఊళ్ళో బ్రతుకు గడిచే సంపాదన లేక హరిహరరాయ్ పరాయిచోటుకి వెళ్ళాడు. అతను చాలా రోజులుగా ఇంటి ఖర్చులకు డబ్బు పంపకపోవడం వల్ల పస్తుల కాపురమయింది. పులిమీద పుట్రలా దుర్గకు జ్వరం రాసాగింది. చేతిలో చిల్లిగవ్వలేదు. రెండు రోజులుగా విడవకుండా వాన. చెరువులూ, వాగులూ పొంగి పొర్లి ఇంట్లోకి కూడా నీరు చేరింది. వంట ఇంటి గోడ పడిపోయింది. ఆ ప్రకృతి విలయంలో చెరువు మరుపు మాటలు మాట్లాడుతూ మలేరియా జ్వరంతో పోరాడుతున్న దుర్గ తన బలహీన స్వరంతో తమ్ముడిని "అపూ! నయమయి లేచాక

నాకొక రోజున ఎప్పుడైనా రైలు చూపిస్తావా నువ్వు” అని అడిగింది. కాని దుర్గ గాలివాన తగ్గిన మరుసటి రోజునే మరణించింది.

బ్రతుకు తెరువు కోసం కృష్ణనగర్ అనే బస్తీకి వెళ్ళిన హరిహరుడు ఏదో కొంత స్థిరమైన ఉద్యోగం దొరికాక ఇంటికి వచ్చి కూతురు మరణించిందని తెలిసి కుప్పకూలిపోయాడు. కొడుకు బాగా చదువుకోవాలి, పండితుడు కావాలి, ప్రయోజకుడు కావాలి అనే బలమైన కోరిక ఉన్నప్పటికి డబ్బు లేక హరిహరరాయ్ మంచి పాఠశాలలో చేర్పించలేకపోయాడు. ఐనా తాను ఇంట్లో ఉన్నంతసేపు కొడుకుని దగ్గర కూర్చోబెట్టుకుని చదివించేవాడు. పుస్తకాలు తెచ్చి ఇచ్చేవాడు.

ఒక్కొక్క పుస్తకం చదువుతున్నప్పుడు ఆనందంతో, ఆశ్చర్యంతో, ఉత్తేజంతో అపూ చెవుల్లోంచి ఆవిర్లు వచ్చేవి. తను చదివిన పుస్తకాల్లో దృశ్యాలే అనుక్షణం కళ్ళముందు కదిలేవి. పుస్తకాల మీద ప్రేమ అపూని కథలు రాయడానికి ప్రేరేపించింది. తను చదివిన పుస్తకాల్ని అనుకరించి, అనుసరించి కథలు రాయడం మొదలుపెట్టాడు. ప్రొద్దువాలిపోయే దాకా ఏటి ఒడ్డున కూర్చుని తను చదివిన కథల్ని జ్ఞప్తికి తెచ్చుకుంటూంటే అపూ మనసులో అపూర్వమైన భావాలు కదిలేవి. తననొక యాత్రికునిగా ఊహించుకునేవాడు. తను చదివిన కథల్లో తనను ఆకర్షించిన పాత్రగా మారిపోయేవాడు. ఆ కథల్లో వర్ణించిన దేశ దేశాలూ తిరగాలని ఆరాటపడేవాడు. మనోహరమైన భవిష్యజీవిత స్వప్నంలో మునిగి తేలేవాడు.



మున్నూట ఇరవై రోజులూ దరిద్రమే ఉన్న నిశ్చిందిపురాన్ని వదిలి ధైర్యం చేసి కాశీ వెళ్ళిపోతే అక్కడ తమ కష్టాలు గట్టెక్కి పోతాయనే ఆశతో వైశాఖ మాసం రాగానే హరిహరుడు నిశ్చింది పురం నుంచి మకాం ఎత్తేయడానికి నిశ్చయించుకున్నాడు.

రుతువులతోపాటు మారిపోయే చెట్లు, నదులు, భూమి, ఆకాశం, పుష్పాలు, ఫలాలతో సాన్నిహిత్యం అపూకి ఎంతో అపురూపం, అవిలేని జీవితాన్ని అతను ఊహించుకోలేడు. ఆ ప్రకృతి అతనిలో సౌందర్య తృష్ణను రేకెత్తించింది, శాశ్వత సౌందర్యోపాస దీక్షను తనకు తెలియకుండానే విశాల ప్రకృతి మెల్లిమెల్లిగా అతనిచేత స్వీకరింప చేస్తోంది. ఎర్రటి పూలను, మాదాసిన పూలకదలికల్ని చూచినా, పక్షుల కూతలు వినపడినా అక్క గుర్తుకువచ్చి మనసు వికలమయిపోయేది. ‘అక్క ఎక్కడికి ఎంత దూరానికి వెళ్ళిపోయిందో! ఇంకెప్పుడూ వీటి అన్నిటితో ఆడుకోవడానికి రాదుగా!’ అని దిగులుపడేవాడు. సంక్రాంతి వెళ్ళాక ఇంక ఊరు వదిలిపోవడానికి సామానంతటినీ సర్దుకుంటున్నప్పుడు ఈ ఇల్లూ, వాకిలీ, వెదురుతోపు, కొబ్బరి చెట్లు, మామిడి తోట, ఏటిఒడ్డు, అక్క తాను కలిసి వనభోజనం చేసినచోటు... ఎంతో ఇష్టమైన నిశ్చిందిపురాన్ని వదిలి వెళ్ళడానికి అపూకి ఎంతో కష్టంగా అనిపించింది.

ఉదయమే హీరూ ఎద్దుబండిలో బయల్దేరి ఊరుదాటిపోతూంటే అపూ బండిలో కూర్చుని సోనాడాంగా మైదానం కేసి, చుట్టూ ఉన్న అపురూపమైన ఆకాశపు రంగుకేసి చూస్తూ తన చిన్నప్పటి స్మృతులనెన్నింటినో నెమరువేసుకోసాగాడు. తన ప్రయాణం ఆరంభమయింది ఇప్పుడే. ఇహ బహుశా తను కలలుగన్న ఆ దేశాల్ని, ఆ అపూర్వ జీవితాన్ని చూడవచ్చు అనుకున్నాడు. రైలు ఎక్కాక, దానివేగం, చక్రాల కిరకిరధ్వనులు, ఇంజన్ మోతను విభ్రమంతో గమనిస్తూ చాలా రోజుల క్రితం ఒకనాడు అక్క తను తప్పిపోయిన దూడను వెతుక్కుంటూ, ఒగుర్చుకుంటూ రైలురోడ్డు చూద్దామని పరుగు పరుగున రావడం గుర్తుకు తెచ్చుకున్నాడు. అంతదూరాన నిల్చుని అక్క, తను ఇంత ముఖం చేసుకుని రైలుబండిని చూస్తూ నించున్నట్లే ఉంది. అక్క చచ్చిపోయిన నిశ్చిందిపురంలో తామిద్దరూ కలిసి తిరిగిన అన్ని పరిసరాల్లోనూ అక్క స్నేహ స్పర్శ తననెప్పుడూ సోకుతున్నట్లే ఉండేది. కానీ ఇవాళే అక్కతో శాశ్వతంగా తెగతెంపులయాయనిపించింది. అదేమిటో తెలియని ఒక విచిత్రమైన అనుభూతితో హఠాత్తుగా అపూ హృదయం నిండిపోయింది. ‘అపూ! నయమయి లేచాక నాకొక రోజున ఎప్పుడైనా రైలు చూపిస్తావా?! అని అక్క అడగటం అతని మనస్సులో ప్రతిధ్వనిస్తూనే ఉంది.

హరిహరరాయ్ విశ్వేశ్వర గల్లీలో మకాము ఏర్పాటు చేసుకున్నాక దశాశ్వమేధ ఘటంలో పురాణ పఠనంతో కొంత డబ్బును సంపాదించసాగాడు. ఐతే హరిహరుడున్న ఇల్లు, గాలి, వెలుతురు రాకుండా చెమ్మగా ఉండేది. తమ ఊర్లోని ఇల్లు శిథిలావస్థలో ఉన్నా గాలి, వెలుతురు బాగా వచ్చేవి. అపూకి ఆ ఇంట్లో ఊపిరాడక ఎప్పుడూ బయటే తిరిగేవాడు. హరిహరుడు కొడుకుని స్కూల్లో చేర్పించాడు.

మాఘమాసం చివరలో హరిహరుడు జ్వరంతో మంచం పట్టాడు. పై అంతస్తులో ఉండే నందబాబుతో అపూకు స్నేహం పెరిగింది. అతని గదిలోని పుస్తకాలంటే అపూకు ఆకర్షణ. కొంచెం జ్వరం తగ్గిన హరిహరుడు బడి నుంచి వచ్చిన కొడుకును పిలిచి దగ్గర కూర్చోబెట్టుకునేవాడు.

మళ్ళీ హరిహరుడు జబ్బు ఎక్కువయింది. సర్వజయకు భర్త అనారోగ్యంతో పాటు నందబాబు కాముక చూపులు, చేష్టలు భయపెట్టేవి. పరాయిదేశం, రోగగ్రస్తుడైన భర్త, చేతిలో దమ్మిడీలేని నిస్సహాయస్థితి, ఎరిగిన వాళ్ళెవరూ లేకపోవడం, పసితనం వదలని కొడుకు, ఏదో ఒక మిషతో తనకు మరీ దగ్గరకు రావాలని ప్రయత్నిస్తున్న నందబాబు ప్రవర్తన.. సర్వజయకు స్థిమితం

లేకుండా వుంది.... కుటుంబాన్ని నిస్సహాయ స్థితిలో విడిచి హరిహరుడు తెల్లవారుఝామున కాలం చేసాడు.

హరిహరుడు చనిపోయాక సర్వజయ బ్రతకడానికి అనేక ఉపాయాల్ని ఆలోచించింది. ఒకోసారి తమ ఊరు నిశ్చిందిపురానికి తిరిగి వెళ్ళిపోవాలని కూడా అనిపించేది. కాని దాన్ని అణచుకునేది. ఎన్నో ఆశల్తో ఊరు విడిచి వచ్చిన తాను ఏడాదిలోపునే నిస్సహాయ స్థితిలో, విధవగా మళ్ళీ తమ స్వంత ఊరు వెళ్ళడానికి మనస్కరించలేదు. బిచ్చమెత్తుకుంటూనయినా సరే కాశీలో తన బిడ్డను పెంచి పెద్ద చేస్తాను అనుకుంది.

ఒక నెలపోయాక ధనిక కుటుంబానికి చెందిన ఒకరు యోగ్యురాలయిన ఒక బ్రాహ్మణ స్త్రీ ఇంటిపనుల్లో సహాయపడడానికి కావాలని తెలియజేయడంతో కాశీకి వచ్చిన ఆ కుటుంబంతో కలిసి వారి ఊరు చేరింది. నలుగురయిదుగురు వంట వారిలో ఒక తెగా సర్వజయ పనిలో చేరింది. పనితో క్షణం తీరేది కాదు. ఇక వీరికి ఇచ్చిన ఈ మకాము కంటే కాశీలో ఉండి వచ్చిన మకామే నయం. ఆ ఇంటి పిల్లలతో అపూకు స్నేహం కాలేదు. వారంతా అనేక ఆటల్ని ఆడుకుంటున్నప్పటికి అపూని చేరనిచ్చేవారు కాదు. దాసీ కొడుకైన అపూకు అవమానాలు, తిట్లు, తన్నులే బహుమానంగా లభించాయి. వీటన్నిటి మధ్య అతనికి ఉపశమనం కలిగించేది చదువు. చినబాబుగారి కూతురు లీలతో అపూకు స్నేహం కలిసింది. అపూ మాటలంటే లీలకు ఆకర్షణ, లీల పొగడ్తల్ని వినడం అపూకు ఆనందం.

**నవల అంతటా పరచుకున్న ప్రకృతి స్నిగ్ధ సుందర చిత్రం మనల్ని మోహపెడుతుంది. ఇచ్ఛామతి నదీజలాల ప్రవాహంలో వెదురు తోటల ఆకుల కదలికల్లో, పూలరేకుల పలకరింపుల్లో, దుర్గ, అపూ హృదయాల అనుకంపనల్లో వినిపించే సంగీతం ఆ పాత్రలతో, ఆ తోటలతో, ఆ నదితో, ఆ మైదానంతో, ఆ ఊరు నిశ్చిందిపురంతో మన హృదయాల్ని అనుసంధానిస్తుంది. సున్నితమైన ప్రతిస్పందనల పరంపర పుస్తకం పూర్తి చేసాక చాలాసేపు మనలో సుళ్ళు తిరుగుతూనే ఉంటుంది.**

తన ఊళ్ళో, తన ఇంట్లో స్వతంత్రంగా సర్వాధికారాలతో బ్రతికిన సర్వజయకు ఈ బ్రతుకు దుస్సహంగా ఉంది. యజమానురాలి పోలిక ఉండి ఆమె వయసుదే అయిన, పీలికలైపోయిన పంచెను ముడివేసుకుని కట్టుకునే నిరుపేదరాలు, తన కటికతనం కారణంగా మరణించిన ఇందిరమ్మ గుర్తుకు వచ్చి సర్వజయ కన్నీళ్ళ కడలి అయింది. అంతర్వేదనతో చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకోదలచి తాను అపరిణిత వయస్సులో చేసిన అపరాధానికి మనసులో క్షమాపణ కోరుకుంది.

కథల్లో చదివిన ధనరాశులతో సహా సముద్రంలో మునిగిపోయిన స్పెయిన్ నౌకను తాను పెద్దవాడయినాక కనిపెట్టాలనే లక్ష్యం అపూ మనసులో నాటుకుపోయింది. తల్లిని ఒప్పించి ఓ స్కూల్లో చేరాడు అపూ. కాని ఆ స్కూలు చుట్టూ ఉన్న మురికి కుప్పల కంపు, పొగతో అపూ తల దిమ్మెత్తిపోయేది. ఇక్కడ సిమెంట్ కాంక్రీట్ ప్రదేశాలు చూస్తూంటే అతనికి ఏదో కోల్పోయినట్టుండేది.

ప్రొద్దు కూకాక నిర్జనంగా వున్న గదిలో కూర్చుని కుమిలి కుమిలి ఏడ్చిన అపూ అమ్మ వచ్చి పిలిచేదాకా ఆలోచనల్లో మునిగిపోయాడు. నిశ్చిందిపురం తనను పిలుస్తున్నట్లు, శంఖాల చెరువు, వెదురు తోపు, సోనాడాంగా మైదానం, నిమ్మపూల వాసనలు... అన్నీ తనను చేతులు చాచి ఆహ్వానిస్తున్నట్లు అనిపించింది. తమను నిశ్చిందిపురానికి వెళ్ళేట్లు చెయ్యమని, లేకపోతే తను బ్రతకలేనని భగవంతుని వేడుకున్నాడు. అప్పుడు పథ దేవత ప్రసన్నంగా నవ్వి తన పథం అనంతమని, దేశాన్ని వదిలి దేశాంతరాల వైపు, సూర్యోదయాన్ని విడిచి సూర్యాస్తమయంవైపు, పరిచితములైన పరిధుల్ని అధిగమించి అపరిచితములైన పరిధులవైపు సాగిపోతుందనీ, దివారాత్రాలనీ, జనన మరణాల్నీ, మాసాల్నీ, సంవత్సరాల్నీ, మన్వంతరాల్నీ, మహా యుగాల్నీ దాటిపోతూనే, ముందుకు సాగిపోతూనే ఉంటుందని చెప్తుంది. "నిన్ను గృహ విముక్తుడిని చేసి తీసుకువచ్చాను. పద ముందుకు పద" అని విశాల ప్రపంచంలోకి కదలమని ప్రోత్సహిస్తుంది.

పిల్లల జాబిల్లి వదనాలు, ముగ్ధ భంగిమలు, ముద్దు మాటలు, చిలిపి చేష్టలు, అమాయకపు ప్రశ్నలు తల్లిదండ్రుల హృదయాలలో ఒంపే సంతోషంతో పోలిస్తే తల్లిదండ్రులు పిల్లలకు చేసేది చాలా తక్కువ అంటారు రచయిత అంతర్మథనం, చేసిన తప్పుకు పశ్చాత్తాపపడడం మనిషిని ప్రక్షాళిస్తుందని, ఉన్నతీకరిస్తుందని తన ఆదపడుచు ఇందిరమ్మ దయనీయ మరణానికి తన కాఠిన్యమే కారణమని గ్రహింపు కొచ్చిన సర్వజయకు కన్నీళ్ళు కట్టుపడకుండా ప్రవహించడం ద్వారా నిరూపిస్తారు రచయిత.

నవల అంతటా పరచుకున్న ప్రకృతి స్నిగ్ధ సుందర చిత్రం మనల్ని మోహపెడుతుంది. ఇచ్ఛామతి నదీజలాల ప్రవాహంలో వెదురు తోటల ఆకుల కదలికల్లో, పూలరేకుల పలకరింపుల్లో, దుర్గ, అపూ హృదయాల అనుకంపనల్లో వినిపించే సంగీతం ఆ పాత్రలతో, ఆ తోటలతో, ఆ నదితో, ఆ మైదానంతో, ఆ ఊరు నిశ్చిందిపురంతో మన హృదయాల్ని అనుసంధానిస్తుంది. సున్నితమైన ప్రతిస్పందనల పరంపర పుస్తకం పూర్తి చేసాక చాలాసేపు మనలో సుళ్ళు తిరుగుతూనే ఉంటుంది. చాలాకాలం వరకు మన చూపు నిశ్చిందిపురానికి తిరిగి పోవడానికి ఆరాటపడుతున్న అపూ అడుగు ఎటు పడుతుందోననే అంశంపైనే ఉత్కంఠతతో నిలుస్తుంది. అద్భుతమైన జీవితానుభవాలను సజీవమైన యవనికపై దర్శించిన ఆనంద స్పర్శ మనకు చిరకాలం మిగులుతుంది. హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ వారు ఈ నవలల తెలుగు అనువాదాలను ఇటీవల ప్రచురించారు.



# అమ్మా - నాన్న - కొడుకు ఒక నిరంతర చక్రబంధం

డా॥ వి.ఆర్. రాసాని
9848443610



నా ప్రాణవాయువు నుంచీ
జీవాణువును పొంది
నా ఉదరంలోని మధుర జలకాసారంలో
నవ మాసాలు పెరిగి
నా పొత్తిళ్ళలో పసిగుడ్డుగా
వాడు ప్రత్యక్షమైనప్పుడు
నా జన్మకు సార్థకం అనుకున్నాను
నా ఒడిలో పడుకుని, నా రొమ్ముపాలు తాగి
హాయిగా నిదురోతుంటే
నేను అమ్మను కదా అనుకున్నాను
వాడు సంకనెక్కి, నేను చూపించే
చందమామను చూస్తూ
గోరుముద్దలు తింటున్నప్పుడు
నా భుజాలనెక్కి, ఈ లోకాన్ని చూస్తునప్పుడు
వాడు నా ప్రాణమే అనుకున్నాను
నా మోకాళ్ళపైన పడుకుని
తన చిట్టి చేతుల్ని నాకిచ్చి
ఉంగా ఉంగా అని ఊయలలూగి
తనపేరు చెబుతుంటే
నా చిరునామావాడే కదా అనుకున్నాను
నావీపు నెక్కి చల్ చల్ గుర్రం ఆడుతున్నప్పుడు
నాకు దారి చూపే నాకంటి వెలుగును కన్నాను
చదువులు చదివి పాఠాలు వల్లిస్తుంటే
నాసర్వ జ్ఞానమూ వాడే కదా అనుకున్నాను
వాడు పెరిగి పెద్దవాడై పెళ్ళి చేసుకుని
పిల్లల్ని కన్నపుడు, ఆ పిల్లల్లోనే
నా ప్రతిరూపాన్ని వెతుక్కున్నాను
వాడి పిల్లలకి లాలపోసి, లాగూలు వేసి
ఆడిస్తూ కబుర్లు, కథలు చెప్పుకుంటుంటే
వాళ్ళే నాలోకం అనుకున్నాను.
ముసలితనంలో కూడు పెట్టినా, పెట్టకపోయినా
ఆదరించినా, నిరాదరించినా ఇంటికి దూరం చేసినా..
నా సర్వస్వం వాడే అనుకున్నాను.
నా రక్తంలో రక్తం – నా మాంసంలో మాంసం
అలా పెరిగి నా శరీరమే అన్ని రూపాలలో
సజీవంగా నా కళ్ళ ఎదుటే కదలాడుతుంటే చూసి
సంతృప్తిగా తనువు చాలించి వెళ్ళిపోతే...
మళ్ళీ వాడే నామనవడికి కొడుకుగా
నాకునాన్నగా.. మళ్ళీ వాడే నా కొడుకుగా,
మనవడిగా, నేనే మళ్ళీ వాడి అమ్మగా
తిరిగివాడే నన్ను కనే నాన్నగా...
ఈ బంధం ఇలా సాగిపోతూనే వుండాలని కోరుకుంటాను
నిత్యమూ.... నిరంతరమూ....

కథ

# అది అభివృద్ధి... ఇది ?

- శ్రీమతి కనుపర్తి విజయబక్ష్
9441382303



"ఏమండి ! మీకోసం ఇందాకట్నుంచి ఎదురు చూస్తున్నా ఎపుడెపుడు వస్తారా ! ఎంత తొందరగా ఈ శుభవార్త మీ చెవిన వేద్దామా అని...'

వాకింగ్‌కి వెళ్ళి వచ్చిన రాజారావుకి గుమ్మంలోనే ఎదురెళ్ళి చెప్పింది ధనలక్ష్మి.

"ఏమిటట అంత శుభవార్త" ఫాన్ వేసుకొని కుర్చీలో కూర్చుంటు అడిగాడు రాజారావు.

"అబ్బాయి ఫోన్ చేసాడండి అమెరికానుండి. ఇపుడు పని చేస్తున్న కంపెనీలో మానేసి వేరే కంపెనీలోకి మారాడట. జీతం కూడా ఎక్కువేట. అంతకు ముందు ఐదువేల అయిదువందల డాలర్లయితే.. ఇపుడు ఆరువేల డాలర్లట. కాకుంటే బాగా దూరమట కార్లో వెళ్ళాలట. రాత్రి కొంచెం ఆలస్యంగా వస్తున్నాడట ఇంటికి. పోన్లేండి. ఆ కంపెనీ కంటే ఈ కంపెనీలోనే జీతం ఎక్కువ వస్తోంది కదా ! అంటూ "అంతా ఆ శ్రీరాముల వారి దయ. పాపం అంత దూరం వెళ్ళి కష్టపడుతున్నందుకు ఆ మాత్రమైనా జీతం ఉండాలిగా.." చేతులెత్తి ఎదురుగ్గా వున్న దేవుళ్ళ పటాలకి దణ్ణం పెట్టింది ధనలక్ష్మి.

'అదేవిటి ! ఆ కంపెనీలో మానేసాడా ! నాలుగేళ్ళ నుండి చేస్తున్నాడు. ఆ కంపెనీ చాలా మంచిదంటుంటాడు. పైగా మన ఇండియనే. ఆ కంపెనీలో బాగా వున్నారన్నాడు. పైగా రైల్లో హాయిగా వెళ్ళి వచ్చేవాడు. ఇపుడు కారు డ్రైవ్ చేసుకొంటు అంత దూరం వెళ్ళాలా! ఇవన్ని కాదనుకొని ఎందుకు మారాడో ఈసారి ఫోన్ చేసినపుడు అడుగుతాను... రాజారావు అదేమంత శుభవార్త కాదన్నట్లు మాట్లాడేసరికే ధనలక్ష్మికి చాలా కోపం వచ్చింది.

'మీదంతా అదోరకం ధోరణి. వాడు అభివృద్ధి లోకి వెళ్తుంటే సంతోషించక పైగా ఏదేదో చెప్తారా? అయినా ఎక్కువ జీతం ఎక్కడుంటే అక్కడికి మారతాడు. ఎప్పట్నించో చేస్తున్నామని పట్టుకొని వేలాడతారా ఏమిటి? వాళ్ళేమైనా వీడిచుట్టాలా? అదీ గాక అంత క్రితం మీరే అన్నారు కదా ! మనదేశంలో లాగ అక్కడ ఉద్యోగాల కేం గ్యారెంటీ లేదని. ఎవరెక్కువిస్తే అక్కడికి మారిపోతుంటారనీను. మనబ్బాయి విషయం వచ్చేసరికే మళ్ళీ యిట్లాగంటాంటారేమిటి?"

'ఔను అక్కడ పద్ధతుల గురించి చెప్పాను' అంటు ఇంక మాట్లాడవలసిందేమి లేదన్నట్లు ఆ రోజు పత్రిక తీసికొని తిరగేయటం మొదలెట్టాడు.

'సమత' కాఫీ తీసుకురామ్మా' అని కేకేసింది ధనలక్ష్మి కోడల్ని.

'వస్తున్నానత్తయ్యా! ఈ రోజు ఇంకా సుబ్బమ్మ పనిలోకి రాలేదు అంట్లన్నీ అలా పడున్నాయి. తోముతున్నాను' చేతులు తుడుచుకొంటు వచ్చింది సమత.

'అదేం సుబ్బి ఇంకా రాలేదా? ఎందుకు రాలేదబ్బా! అట్లా చెప్పాపెట్టకుండ మానేయదే ! ఒకవేళ మానేయాలన్నా ముందుగానే చెప్పి మానేస్తుందే ! సర్లే ఆ గిన్నెల పని తర్వాత చూడొచ్చు. ముందు కాఫీ పెట్టి నాకు, మామయ్య గారికి ఇవ్వు. ఇంకా చిన్నాడు జిమ్ కెళ్ళి రాలేదా ?'

'లేదత్తయ్య"

రాజారావు ధనలక్ష్మి దంపతులకు ఇద్దరే కొడుకులు. రాజారావు రిటైర్డ్ బ్యాంక్ ఉద్యోగి. పెద్ద కొడుకు మురళి అమెరికా వెళ్ళి నాలుగేళ్ళయింది. వెళ్ళిన రెండేళ్ళకే పెళ్ళవటం, ఏడాది

తిరక్కుండా ఓ బిడ్డకి తండ్రవటం కూడా జరిగింది. రెండో కొడుకు శ్రీనివాస్ ఉన్న ఊళ్ళోనే బ్యాంకులో పనిచేస్తున్నాడు. చిన్న కోడలు బాగా చదువు కొన్నా, ఉద్యోగం ఏమి చేయటం లేదు. అత్తగారికి చిన్న పెద్ద పనుల్లో సాయపడుతుంటుంది. ఎక్కువగా చదువుకోటం యిష్టపడుతుంటుంది. అత్తగారితో గొడవలేమి లేవు కాని, స్వార్థపూరితమైన ఆమె ఆలోచనలే నచ్చక ఏమి చెప్పలేక ఇబ్బంది పడుతూ వుంటుంది.

ఉదయం నుండి బావగారి ఫోన్ తర్వాత అత్తగారి సంతోషం చూచి నవ్వుకొంది. అటు నుంచి కొడుకు చెప్పేది వింటూనే ముఖమంతా నవ్వు పులుముకొంటు, మధ్య మధ్యలో 'అమ్మో', 'ఆహాఁ' అంటు మంచి వార్త రా బాబు... అయితే నీకిపుడు మూడు లక్షలన్న మాట జీతం. పోన్లే నాయనా ! దేశం కాని దేశం వెళ్ళి ఆ మాత్రం కష్టపడుతున్నందుకు అంత జీతం లేకుంటే ఎట్లా? పెరిగిందంతా ఖర్చుచేయకండి. అదనలు లేదనుకొని ముట్టుకోకుండ దాచుకోండి. అక్కడ ఇల్లు కొనుక్కోవాలనుకొంటున్నావు కదా! ఆ అఁ ఇప్పటికయినా మంచి పని చేసావు. నాలుగేళ్ళ నుండి ఆ కంపెనీనే పట్టుకొని వేలాడుతున్నావు. ఇప్పుడైనా ఏవైనా మంచి కంపెనీలో జీతం ఇంతకంటె ఎక్కువగ వుంటే మారిపో !... ఇట్లా సాగిన అత్తగారి సంభాషణ వింటోన్న సమతకు ఆశ్చర్యం వేసింది.



ఫోన్ పెట్టేసిన వెంటనే ఆ ఆనందం ఆపుకోలేక చిన్న కోడల్ని పిలిచి ఏవేవో సంగతులు అమెరికా గురించి అక్కడ వాళ్ళు వెళ్ళినపుడు చూచిన వింతలు విశేషాలు గురించి ఏదేదో చెప్ప సాగింది. అత్తగారికి పిల్లలపట్ల వున్న శ్రద్ధకి, వాళ్ళ జీతభత్యాలు, ఖర్చుల విషయంలో ఆమెకున్న ఆసక్తికి సమతకి చాలా ఆశ్చర్యం వేసింది.

పైగా అక్కడ కొడుకుకు జీతం పెరిగిందన్న ఆనందం ఆమెను ఏదేదో మాట్లాడేసేలా చేసింది. 'ఆ రోజు కారోజు ఖర్చులు పెరుగుతున్నాయి. పైగా అక్కడ అన్ని మన వస్తువులు దొరికినా రేట్లెక్కువ. వెళ్ళినపుడు వాడొక్కడే. ఇపుడు పెళ్ళాం, పిల్లాడు. బాగా ఖర్చు పెరిగింది కదా ! అన్ని వేలమైళ్ళ దూరం వెళ్ళినందుకు నాలుగు డబ్బులన్నా వెనకేసుకోవాలి కదా !"

అత్తగారి మాటలన్ని తలచుకొంటు వంటగది సింక్ దగ్గర నిలబడి అంట్లు తోముతోంది సమత.

"అయ్యయ్యో ! మీరుతోమేసినారా గిన్నెలు. లెగండి నే వచ్చేసిన గందా ! సేతులు కడుక్కొండి సిన్నమ్మ గారు..." అంటూనే సుబ్బమ్మ ఎంత వేగంగా వచ్చిందో అంతే వేగంగా సింకులో వున్న అంట్లన్నీ గబగబ బయట వేసింది.

"ఏమే సుబ్బి! ఈ రోజంత ఆలస్యంగ వచ్చావేం"? గద్దిస్తున్నట్లు అడిగింది ధనలక్ష్మి.

"ఈ రోజు కాసింత ఆలిసం అయిందమ్మ. యియాల్టి నుండి ఇంకో ఇంటికాడ పనికొప్పుకొన్నా. ఆడజేసి వచ్చేతలికే ఆలిసం అయింది" గబగబ అంట్లు తోముతోన్న సుబ్బి చేతులు నోటితో మాటలతో మాకేంటి పనని వేగంగా గిన్నెల మీద కదులుతున్నాయి.

"ఏమే ముందు మా ఇంట్లో చేసాకనే మరో యింటికెళ్ళు. మాకీ అంట్ల గిన్నెలవి చికాకుగ పడుంటే కష్టం. పైగా ఈ గదుల పాచి ఊడ్వలేదనుకో ! నాకు పూజకు పనికిరాదు".

'అట్లాగంటే ఎట్టమ్మా ! నేనొప్పుకొన్న ఆయిల్లు నేనొచ్చే తోవలోదే ! ముందు ఆడ ముగిత్తే నాకు బాగుంటది తల్లి. మీ ఇంట్లో చేసుకున్నాక ఆచారి గారింట్లో చేసి యిట్టాగెల్లిపోతానింక."

"ఎన్నిళ్ళు చేస్తున్నావేంటి? వ్యంగ్యంగ అడిగింది ధనలక్ష్మి.

'తప్పదు కదమ్మా! కట్టపడకపోతే యీ పిల్లల్ని ఎట్టా సాకేది?' తీరికగ కూర్చుని ధనలక్ష్మి ఏదో మాట్లాడుతూనే ఉంది. ఏదో ఓ సమాధానం చెబుతూనే సుబ్బమ్మ చకచక గిన్నెలు తోమి కడిగేస్తోంది.

ధనలక్ష్మికి పెద్ద పనేమి ఉండదు. బయట పనులన్ని సుబ్బమ్మ చక్కబెడితే లోపల వంటపనంత సమత చూసుకొంటోంది. తీరికగ కూర్చుని ఆమె మాట్లాడుతుంటే సుబ్బమ్మ చేసే పని ఆపకుండానే జవాబిస్తోంది. గిన్నెలు తోమేసి బకెట్లో నీళ్ళు బట్టి ఫినాయిల్ వేసింది కొంచెం, అరుగులన్ని శుభ్రంగా కడిగి చక్కగ చకచక ముగ్గులు పెట్టేసింది.

ఈలోగా సమత గ్లాసుతో టీ తెచ్చి సుబ్బమ్మ కిచ్చింది. టీ అందుకుంటు సిన్నమ్మ గోరు లోపల గదులన్నింటికి గుడ్డ పెట్టేస్తాను" అంది.

"ముందు టీ తాగు... ఆ తర్వాత చేద్దువు" ఒక్క క్షణమైనా నిలబడకుండ బొంగరంలా గిర గిర తిరుగుతు పనిచేస్తోన్న సుబ్బమ్మ కేసి గుడ్లప్పగించి చూస్తోంది సమత.

మరో అరగంటలోపనంతా ముగించుకొని 'అమ్మగారు' అని కేకసింది ధనలక్ష్మిని సుబ్బమ్మ.

"వస్తున్నా! ఉండవే" అంటు డబ్బులు లెక్కబెడుతూ వచ్చింది ధనలక్ష్మి.

'ఇదిగో నీ జీతం ఆరొందలు' అని చేతిలో బెడుతు 'లెక్క చూసుకో' అంది.

'అదేటమ్మా! మీరు లెక్కబెట్టి యిచ్చాక నేనెపుడన్నా లెక్కెట్టుకొన్నానమ్మా!' అంటు చీరెలో దోపుకొన్న మొలసంచి తీసి నోట్లు అందులో బెట్టి తాళ్ళు దగ్గరకు చేర్చి మళ్ళీ చీరెలో దోపుకొంది.

"ఈరోజు ఒకటో తారీఖు కదే ! అందుకనే జీతం యిచ్చేసాను. నాకెందుకో రెండు రోజులు దాటినా యిష్టముండదు.



నీవు పోయిన నెలలో రెండు రోజులు నాగా బెట్టినా పోన్లే పిల్లల గలదానివని 'కట్' చేయకుండా మొత్తమిచ్చేను" తన దయాగుణం ఇటు సుబ్బమ్మ, అటు కోడలు గుర్తించాలని ధనలక్ష్మి తాపత్రయం.

"అమ్మా ! రెండు రోజుల జీతం ఎంతమ్మా. ఓ నలభై రూపాయలు మీలాంటోరికి అదేం లెక్కలో కొత్తుంది... మాలాటి బీదోల్లకి ఓరోజుకి ఖరుచువత్తది తల్లి"

"ఔననుకో ! అందుకే గదా యిచ్చాను"

"అమ్మా! యియ్యాల మీకో మాట సెబుదామని. నేనింకో పది పదేను రోజులే పనిలో కొత్తాను. ఆ తర్వాత మానేత్తాను. ఒకేపాలి మానేత్తానీ రోజుంటే మీరిబ్బంది పడతారు. ఇంకోల్లని చూసుకోండమ్మ.."

"ఏం నీకేమొచ్చింది" ధనలక్ష్మికి కోపం కట్టలు తెచ్చుకొంది.

"మాయింటికాడనే అపార్టుమెంటులో రెండిల్లు ఒప్పేనుకొన్నానమ్మ బాగా దగ్గిరి. సెరొక వెయ్యి రూపాయలిత్తామన్నారు. ఈ రోజు కాడ్నుంచి ఎల్తన్నా! మీకు సెప్పసేయకుండ మానేత్తే యిబ్బంది పడతారని సెబతన్నా! పిల్లలెదుగుతున్నారు కదమ్మా! బల్లోకెల్తున్నారు. కాసంత నాలుగు రాల్లు సేతిలో వుంటాయి కందా అని ఒప్పేసుకొన్నా..."

"అయితే సుబ్బి! అంత విశ్వాసం లేకుండా నాలుగేళ్ళ నుండి చేస్తున్న పని మానేసి వెళ్ళిపోతావా? నిన్నెంత బాగా చూసాం యిన్నాళ్ళు? ఎవరో జీతం ఎక్కువంటే వెళ్ళిపోవటమేనా? పోని జీతం తక్కువయితే పెంచమని అడగొచ్చుకదా! అదీ లేదు..."

"అమ్మా పోయినేడాది వందపెంచాం. ఇంక ఇప్పుడల్లా పెంచను అని మీరన్నారు గందా! రెండు మూడ్సార్లడిగినా! నెలకి ఆరొందలు సానా ఎక్కువని అన్నారు. ఏడాది దాటిపోయిందా మీరు జీతం పెంచలేదు. అయినా సానా దూరాన్నించి వత్తన్నా! నేను యింటికాడ కెల్లేనరికే కాల్లు పీకుతున్నాయి... ఏమనుకోకాండి.. ఏరే మడిసిని సూసుకోండి... సమతమ్మగారు! ఎల్లొత్తా అంటు సుబ్బమ్మ వెళ్ళిపోయింది.

సుబ్బమ్మ అటు వెళ్ళిందో లేదో ధనలక్ష్మి తిట్లు ప్రారంభించింది. మనసులో అక్కసంతా మాటల్లో బయటపడిపోతోంది. "విశ్వాసం లేని మనుషులు ఎంత బాగా చూసినా ఎంత పెట్టినా వీళ్ళ బుద్ధి మాత్రం పోదు... అసలిక్కడేం పనుందని? ఆరొందలు కంటే ఎక్కువ ఎందుకో ! చేసే చేసే పని వదిలేసి ఎవరో ఎక్కువ జీతం యిస్తామంటే వెళ్ళిపోయింది. ఇటువంటి వాళ్ళనసలు దగ్గరకే రానీయకూడదు. ఈ నాలుగేళ్ళు ఎంత బాగా చూసేను నాలుగు చీరెలిచ్చాను. ఏది మిగిలితే అదెల్లా పెట్టాను.. ఎపుడో ముందే మానెయ్యాలనుకొని ప్లాన్. ఈరోజు ఒకటో తారీఖు కదా! ఏం ఎరగనట్లు నంగనాచిలా వచ్చి జీతం పట్టుకెళ్ళింది. ఒకటో తారీఖు వచ్చిరాగానే ఆరుకాయితాలు చెక్కల్లా చేతులో పడేస్తానా? ఎంత మోసం.. ఈ సంగతి ముందే తెలిసుంటే ఆ రెండు రోజుల జీతం 'కట్' చేసి వుందును కదా! ఇట్లాంటి వాళ్ళనసలు నమ్మకూడదు. నాదే తప్పంతా..." 'అత్తయ్య గారు!" అనే పిలుపుతో వాక్ప్రవాహాన్ని ఆపి 'ఆఁ ఆఁ ఏమిటి?' అంది కోపంగ ధనలక్ష్మి. 'అసలిప్పుడు పనిమనుషులు దొరకటమే కష్టమైంది కదా! మనం కూడా ముందుగానే సుబ్బమ్మకు జీతం పెంచితే ఉండేదేమో" "ఏం నీకంత ఎక్కువయిందా డబ్బు? అయినా పనేం ఎక్కువ అయిందని జీతమెక్కువివ్వాలి. నాలుగు గిన్నెలు తోమటం, గదులు శుభ్రం చేయటం ఇంతే కదా! జీతం ఒక్కటే చూసుకొంటే ఎట్లా? రోజు యిచ్చే కాఫీ టిఫెన్ లెక్కగడితే ఎంతయింది? అవి లెక్కలోకి రావా? జ్వరమని జలుబని అంటే ఎన్నిసారు టాబ్లెట్లు ఇచ్చేం. అవన్ని మరచిపోయిందేమో! ఎన్నిరోజులు మానేసినా జీతమంతా యివ్వవలసిందే ! వీళ్ళకసలు కృతజ్ఞత అనేది ఏ కోశాన వుండదు..."

సమత పైకి ఏం మాట్లాడలేదు కాని లోపల రకరకాలుగ సమాధానాలు పైకురకలేక పైకిలేచి మళ్ళా లోపలకే పరుగెత్తుతున్నాయి. 'సుబ్బమ్మకు టాబ్లెట్లు యిచ్చింది ప్రేమతో కాదు. ఏ జ్వరమో వస్తే పనిలోకి రాదనే భయంతోనే. ఏదో ఉదారంగా జీతమిచ్చినట్లు చెప్పుకోటం.. కట్ చేయలేదని డబ్బా కొట్టుకోటం.. ఈ నెల్లో రెండు రోజులు ఎంత భయంకరమైన వర్షం! ఎట్లా వస్తుంది అంత దూరం నుంచి !

ధనలక్ష్మి బాధపడిపోతూనే ఉంది. పొద్దుటే విన్న శుభవార్త తాలూక సంతోషం ఇంకా అందరితో పంచుకోకుండానే ఈ విశ్వాసఘాతక క్రియ ఆమె మనసుని తొలిచేస్తోంది. చేసేచేసే ఇల్లు వదిలేసి ఎక్కువ జీతమిస్తున్నారు వేరే వాళ్ళని "ఇక నే రాను పనిలోకి" అంటుందా! ఎంత మోసం ! ఎంత ధైర్యం !

ఇట్లా మాట్లాడుకొంటు తాను సుబ్బమ్మకు ఎపుడెపుడు ఏమేమి పెట్టింది, ఏమేమి యిచ్చిందో అన్ని గుర్తుచేసుకొంటు తిడ్తూ, గొణుగుతూ ఉంది ధనలక్ష్మి. సమతకు అత్తగారి ధోరణి ఏమిటో బోధపడలేదు. ఉదయం బావ గారి ఫోన్ జీతం ఎక్కువని నాలుగేళ్ళ నుండి, తాను అమెరికాలో కాలు పెట్టిందగ్గర నుండి ఇప్పటి వరకు చేస్తోన్న కంపెనీలో మానేయటం ఆ వార్త అత్తగారికి అంత సంతోషం కలిగించటం... అదే పని ఇక్కడ సుబ్బి చేస్తే ఎందుకంత ఉక్రోషం... ఒకే విషయానికి ఎందుకిట్లా వేరు వేరుగ స్పందించటం.. కాకుంటే అక్కడ పెరిగింది డాలర్లు... ఇక్కడ రూపాయలు.. అక్కడ లక్షల్లో అయితే.. ఇక్కడ వందల్లో ! మరి అదంతా అత్తగారి దృష్టిలో అభివృద్ధి అయితే ఇదీ అవ్వాలి కదా! అట్లా అవలేదంటే అర్థం ?



# మనో నేత్రం విచ్చుకుంటే....

పాతూరి అన్నపూర్ణ
9490230939

ఎప్పటిలానే సూర్యోదయంతో
రోజు ఒళ్ళు విరుచుకున్నది
ప్రతిరోజూ చూస్తున్న నగరమే
అదే మనుషులు, అవే మొహాలు
ఏదో హడావిడిగా పరుగులు
పొట్టకూటి కోసం పడరాని పాట్లు
వైకుంఠపాళిలో నిచ్చెనలా ఎక్కేమెట్లు
పాములనోట్లో పడితే పాకుడురాళ్లు
చూసిచూసి విసుగుపుడుతున్నది
సగం జీవితం ఖర్చయినా
తరగని సమస్యల బరువు
బరువుకు తగ్గట్లు పెరగని ఆర్థిక వనరులు
మొగుడూ పెళ్ళాల మధ్య
ఒకే కడుపున పుట్టిన బిడ్డల మధ్య
పెరుగుతున్న దూరాల కొలతలు
అన్నీ ఆర్థిక అవసరాల బంధాలే
వీళ్ళంతా నా వాళ్ళు అన్న ముసుగుని
తెరలాగా కప్పుకోవడమే జీవితం
ఎన్నేళ్ళ నుండీ చూస్తున్నా ఈ నిర్జీవ చిత్రాలని
రంగు వెలసి పోవడం తప్ప వాటికేం తెలీదు
ఈ నైరాశ్యపు దుప్పటి అప్పుడప్పుడు
నన్ను ఎందుకు చుట్టుకుంటున్నది
ఇవన్నీ అవసరం లేని ఆలోచనలా ?
ప్రశ్నలు ! ప్రశ్నలు !
మస్తిష్కాన్ని క్రమ్మేస్తున్న వందలకొద్దీ ప్రశ్నలు
బరువెక్కిన గుండెలతో
నిద్రలోకి జారుకున్నాను.
ఆ రాత్రి నిశ్శబ్దంగా గడచిపోయింది
మళ్ళు ఎప్పట్లాగే తెల్లారింది
నా గదికిటికీ తెరచాను
రోజూ చూడని దృశ్యం
కూలిపోయిన చెట్టు పక్కనే
మట్టి నుండి మొలకెత్తిన మొక్క
ఆకు పచ్చని రంగులో చిట్టి చిట్టి ఆకులతో
మంచు ముత్యాలతో తడిసి స్వచ్ఛంగా



పిల్లగాలులకు ఊగుతూ కనబడింది
అప్రయత్నంగా
పాదాలు ఆవైపుకు నడిచాయి
సుతిమెత్తగా మొక్కని స్పృశించాను
ఏదో నూతనశక్తి నరనరాల ప్రవహించింది
నాలో కొత్త రక్తం ప్రవహించడం మొదలైంది
చెట్ల మీద పిట్టల కిలకిల రావాలకు
ఒక చిన్న గగుర్పాటుకు లోనైంది శరీరం !
పునర్నిర్మాణంలోనే ప్రపంచం కదులుతుంది
ఒక సన్నివేశం పూర్తి అయినా
మరో సన్నివేశానికి ప్రారంభం వుంటుంది
ఆశను పట్టుకుని అడుగులు వేస్తేనే
ప్రతిరోజూ మనదవుతుందని తెలిసింది
నా నైరాశ్యపు దుప్పటిని విదిలించాను
కొత్త మనిషిగా మారి ముందుకు కదిలాను
ఇప్పుడు రోజూ చూస్తున్న దృశ్యాలే
రంగులు అద్దుకుని కనిపిస్తున్నాయి.

# అలావా నిప్పుల నిడక - ఓ అమ్మీజాన్ జీవితం !

- కల్పనా రెంటాల




**మెజారిటీ హిందువుల జీవితాలు, వారి జీవన విధానానికి సంబంధించిన ప్రతీకలు మాత్రమే ఎక్కువగా చదవటంతో మొద్దుబారి వున్న మనసును రహమతుల్లా 'అమ్మీజాన్' కథ ఒక్కసారి గట్టిగా కుదిపి మేల్కొల్పోతుంది. అమ్మ గురించి కొడుకు చెప్పే కథలు, కూతురు చెప్పే కథలు ఉన్నాయి. భానుమతి అత్తగారి కథలు ఉన్నాయి. కానీ అత్త గురించి అల్లుడు చెప్పే కథలు మాత్రం తెలుగు సాహిత్యంలో నాకు తెలిసినంతలో ఎక్కడా లేదు. ఆ రకంగా రహమతుల్లా కథ, కథనం రెండూ విశిష్టమైనవే.**

"చర్మాన్ని చీల్చుకొని బొక్కలు బయట పడనున్నట్లు, సాయిబుల పీరు మాదిరుందామె."

ఈ వాక్యంతో మొదలవుతుంది 'బా' రహమతుల్లా రాసిన 'అమ్మీ జాన్' కత. ఈ మొదటి వాక్యం చదవగానే కడుపులో తిప్పినట్లవడమే కాకుండా కళ్ల ముందు ఓ శవం రూపం కూడా దృశ్యమానమవుతుంది. అయితే ఆ జీవచ్ఛవానికి ఓ మతం కూడా రూపు కట్టినట్లు కన్పిస్తుంది. ఎముకలు బయటకొచ్చినట్లు.. 'నడిచే శవంలా'... 'జీవచ్ఛవంలా వున్న' లాంటి పద చిత్రాలు కళ్లకు, మెదడుకు అలవాటైౖ సాయిబులు పీరు మాదిరి వున్న ఆ పాగల్ తల్లి అన్న మాట కూడా కొత్తగా అనిపిస్తుంది.

మెజారిటీ హిందువుల జీవితాలు, వారి జీవన విధానానికి సంబంధించిన ప్రతీకలు మాత్రమే ఎక్కువగా చదవటంతో మొద్దుబారి వున్న మనసును రహమతుల్లా 'అమ్మీజాన్' కథ ఒక్కసారి గట్టిగా కుదిపి మేల్కొల్పోతుంది. అమ్మ గురించి కొడుకు చెప్పే కథలు, కూతురు చెప్పే కథలు ఉన్నాయి. భానుమతి అత్తగారి కథలు ఉన్నాయి. కానీ అత్త గురించి అల్లుడు చెప్పే కథలు మాత్రం తెలుగు సాహిత్యంలో నాకు తెలిసినంతలో ఎక్కడా లేదు. ఆ రకంగా రహమతుల్లా కథ, కథనం రెండూ విశిష్టమైనవే. అమ్మ లాంటి తన పుప్పమ్మ (అత్తమ్మ) జీవితం గురించి ఓ అల్లుడు దృష్టి నుంచి నడిచిన ఈ కథ మన మనసులోకి చేరి మర్చిపోవటానికి వీల్లేకుండా అక్కడ తిష్టవేసుకొని ఉండిపోతుంది.

"....తల్లి తల్లే. పిచ్చిదైనా.. ఎడ్డిదైనా పేగు సంబంధాన్ని తెంచుకోదు. ఇంకా విచ్ఛిన్నం కాకుండా పవిత్రంగా వున్న మానవీయ సంబంధం అదొక్కటే కదా !" మొత్తం అమ్మీజాన్ కథ మొత్తం ఈ వాక్యం చుట్టూ పరిభ్రమిస్తుంది. అత్త కూడా అమ్మే. ఆ అమ్మతనానికి మతం లేదు, కేవలం మానవత్వం తప్ప. రెండు మతాలకు చెందిన ఇద్దరు తల్లులుంటారు ఈ కథలో. అయితే మతం వారి అమ్మతనానికి ప్రతిబింబమో, ప్రతిబంధకమో కాదు, కాలేదు. ఏ మతానికి చెందినదైనా అమ్మ అమ్మే. ఆ అమ్మకు పిల్లలను ప్రేమించటం, వారి తప్పులని క్షమించటమూ తప్ప మరొకటి తెలియదు. కన్న పేగు క్షేమం తప్ప మరో ధ్యాస వుండదు.

"అమ్మ రూపంలో వున్న దేవతల తల్లి లా ప్రశాంతంగా వున్న పుప్పమ్మ ఒక సాధారణ ముస్లిం మహిళ. ఆమె పేరు ఫాతిమా బీ అయినా, కథ నిండా ఆమె పుప్పమ్మ, అమ్మీజాన్ మాత్రమే. ఆమె పేరు లుప్తమై పోయి ఆమె అత్తతనం అమ్మతనంగా మారిపోయి అమ్మీజాన్‌గా మిగిలిపోయిన వైనమే కథ అంతా. ఆమె గురించిన వర్ణనతోనే తొలిసారి పాఠకుల మనస్సులో ఆమె గురించిన ఒక ముద్రపడిపోతుంది. "ఫాతీమా అంటే ప్రశాంతతకు మారు పేరులా అనిపించేది. ఆమె సమక్షంలో వున్నంత సేపూ మనసుకి హాయిగా, నిమ్మదిగా ఉండేది. ఆమెలో అటువంటి నిర్మలమైన శక్తి వుండేది. వరుసకు ఆ యమ్మ నాకు పిల్లనిచ్చిన పుప్పమ్మ అయినా, మా మధ్య తల్లీ కొడుకుల అనుబంధం ఉంది."

అమ్మ అంటే ప్రేమకు మారుపేరు లాగానే... అమ్మ అంటే కష్టాల సముద్రం, నడిచే అగ్ని పర్వతం. ఈ కథలోని పుప్పమ్మ కూడా అంతే. అలావా నిప్పుల్లో నడవటం అలవాటైనట్లే పుప్పమ్మకి కూడా కష్టాల సుడిగుండాల్ని దాటటం అలవాటైపోయింది. తాగుబోతు భర్త బాధ్యతారాహిత్యంగా ఇల్లు పట్టకుండా తిరుగుతుంటే చాలీచాలని డబ్బుతో పిల్లల ఆకలిని తీర్చలేక 'యా ఖుదా! మాతృమూర్తుల్ని ఈ భయంకర శాపం నుంచి విముక్తం చేయలేవా?' అని ప్రార్థన చేసుకునేది. ఎదుగుతున్న కూతుర్ల తొడలు కనిపించకుండా వుండేందుకు పొట్టి గౌన్లను కిందకు లాగటంలో విఫలమై ఆ తల్లి గుండె ముక్కచెక్కలయ్యేది. తండ్రి మరణంతో గవర్నమెంట్ ఉద్యోగం సంపాదించుకున్న ఎదిగొచ్చిన కొడుకు, చెల్లెళ్ల పెళ్లిళ్లకు సహాయపడతాడనుకుంటే ఒక బ్రాహ్మణ యువతిని ప్రేమించి పెళ్లి చేసుకొని వెళ్లిపోవడంతో ఆ తల్లి హృదయం బద్దలైపోయింది. అయినా

కొడుకు మీద మమకారం చావలేదు. అతన్ని, అతని కుటుంబాన్ని తనివితీరా ఒకసారైనా చూచుకోవాలని ఆమె మాతృ హృదయం ఆరాటపెట్టింది.
పుప్పమ్మ కొడుకు జహంగీర్ కాస్తా జగదీశ్వర్‌గా మారిపోయి తల్లిని, చెల్లెళ్లను కూడా పట్టించుకోకుండా ఎక్కడో దూరంగా తన బతుకేదో తాను బతుకుతున్నాడు. కొడుకుని చూడక అయిదేళ్లు దాటిపోవడంతో కొడుకుని, ఒద్దరు మనవాళ్లను ఎలాగైనా ఒకసారి కంటి నిండా చూసి రావాలని పుప్పమ్మ తన కూతుళ్లు, అల్లుడు, వారి పిల్లలతో బయలుదేరింది. బస్సు ప్రయాణంతో పాటే కథకుడు (అల్లుడు) ఆలోచనల ద్వారా పుప్పమ్మ జీవితంలోని ఒక్కో పొర గురించి పాఠకులకు నెమ్మదిగా తెలుస్తుంది. కొడుకు చిక్కిపోయాడంటే కోడలు ఏదో మందో మాకో పెట్టి ఉంటుందేమో అని ఆమె అనుమానపడటంలో కూడా కొడుకు మీదున్న ఆమె ప్రేమగానే అర్థమవుతుంది. తప్ప కోడలిని దాష్టీకం పెట్టే అత్త లాగా కనిపించదు. ఎట్టకేలకు బస్సు వెళ్ళాల్సిన చోటుకు చేరుకుంటుంది. బ్రాహ్మణవాడలో జగదీశ్వర్‌గా పేరు మార్చుకొని బతుకుతున్న బావమరిది ఇంటికి వెళ్ళి పాత పద్ధతిలో 'సలేమాలేకుమ్' అని పలకరిస్తాడు భాయిజాన్. ఆ పిలుపుకి భార్యా భర్తలిద్దరూ ఉలిక్కిపడతారు. చీకటిపడ్డాక తల్లి బురఖా తీసేసి ఇంటికి వస్తే ఒక గంట మాట్లాడి పంపిస్తానని చెప్తాడు ఆ కొడుకు. బస్టాండ్‌కి తిరిగొచ్చి ఆ మాట పుప్పమ్మకి చెపితే... "అందరి ముందు, పెద్ద మనిషని కూడా చూడకుండా, లాగి పెట్టి చెంప చెళ్లుమనిపిస్తే, ముఖం ఎలా అయిపోతుందో అలా అయిపోయింది ఆమె మొహం." బురఖా తీసేసి కొడుకు ఇంటికి వెళ్లలేని తల్లి. బ్రాహ్మణవాడలో బతుకుతున్న తమ ఇంటికి తల్లిని, చెల్లెళ్లను తీసుకెళ్లని నిస్సహాయత ఆ కొడుకుది. దూరమైపోయిన అత్తింటి వారు ఎటూ దూరంగానే వున్నారు. ముందున్నది తన కూతుళ్ల భవిష్యత్తు. వాటిని ఫణంగా పెట్టలేని జహంగీర్ అలియాస్ జగదీశ్వర్ భార్య. తనను, తన పిల్లలను ఒక్కసారైనా తనివి తీరా చూసుకోవాలని తల్లి మనసు ఆరాటపడుతుందని తెలుసు ఆ కొడుక్కి పిల్లలిద్దరిని తీసుకొని బస్టాండ్‌కి వెళ్ళి దూరంగా నిలబడతాడు. ఒకరితో ఒకరు మాట్లాడుకోరు ఆ తల్లీకొడుకులు. కానీ ఒకరినొకరు చూసుకుంటారు. అలా వారి కన్న పేగు బంధం ఆ చీకటి వర్షపు రాత్రిలో నెమ్మదిగా ఒకరికొకరు అందనంత దూరంలోకి జారిపోతుంది.

**మనవరాళ్లను ఒకసారి చూసుకొని తిరిగెళ్ళిపోతామని అత్తమ్మ చెప్పి పంపించిన మాటలకు ఆ కోడలికి కళ్ళు చెమ్మగిల్లుతాయి. కథకుడి లాగాన అప్పటి దాకా పాఠకుడు కూడా ఆమెను అపార్థం చేసుకొనే వీలుంటుంది. ఆడపడుచుల కోసం మూడు జాకెట్టు ముక్కలు, బయట ఎక్కడా ఏమీ తినని అత్తమ్మ కోసం పెరుగన్నం ఒక బాక్స్‌లో పెట్టి తీసుకొచ్చి వచ్చే వరకు ఆ కోడలి మనసులో అత్తింటి వారి స్థానం ఏమిటో ఎవరికీ తెలియదు. అదంతా కూడా దొంగ ప్రేమ అని పొరపడే అవకాశం ఉంది. అది నిజం కాదని ఆమె మాటలు చదివాక అర్థమవుతుంది.**

ఈ కథ పేరు "అమ్మీ జాన్" అంటే ప్రియమైన అమ్మ అని అర్థం. ఈ కథలో ఎవరు ఆ ప్రియమైన తల్లి? పుప్పమ్మ కాక మరెవరూ? అనిపిస్తుంది ఎవరికైనా! కాని ఈ కథలో ఇద్దరు తల్లులున్నారు. ఇద్దరూ వేర్వేరు మతాలకు చెందినవారు. అయినా ఇద్దరి నీకలిపే అంతః సూత్రం ఒక్కటే అమ్మతనం. తల్లులుగా ఆ ఇద్దరూ ఒక్కటే. పిల్లల క్షేమమే వారి ప్రాధాన్యత. కథ ప్రారంభము నుంచీ ముగింపుకు వచ్చే వరకు ఈ కథ ఫాతీమా మీ / పుప్పమ్మ గురించి మాత్రమే అనుకుంటాము. కథలో అమ్మీజాన్ ఆమె మాత్రమే అనుకుంటాము. ముగింపు వచ్చేసరికి మరో 'ప్రియమైన అమ్మ' కనిపిస్తుంది. కోడలి పాత్రలోని మరో అమ్మ. ముస్లిం భర్తను హిందువుగా మార్చుకున్న భార్యలో దాగున్న అమ్మ. అత్తను, ఆడబిడ్డలను ఇంటికి రానివ్వకపోయినా, వారి ఆకలిని గుర్తెరిగి వారి కోసం అన్నం పంపిన అమ్మ. పెళ్లి కావాల్సిన కూతుర్ల కోసమో, తాను మనసా, వాచా, కర్మణా నమ్మిన మత సిద్ధాంతం కోసమో బురఖా తీయటానికి సిద్ధపడలేకపోయింది పుప్పమ్మ. హిందువులుగా పెరుగుతున్న తన కూతుర్లకు, తన కుటుంబానికి ఎలాంటి కష్టం, నష్టం వాటిల్లకుండా వుండేందుకు ముస్లింలైన అత్తింటి వారిని ఇంటికి మనసారా ఆహ్వానించలేపోయింది బ్రాహ్మణ కోడలు. కథలో ఈ రెండో అమ్మకు పేరు లేదు. కులం, మతం తప్ప. భర్తను తన మతంలోకి మార్పించుకొని కన్నవారిని అతనికి దూరం చేసిన బ్రాహ్మణ వాడ పిల్లగా మాత్రమే కథలో ఆమె ఉనికి. ఆమెలోని చెడ్డతనం చూపించినట్లు మొదట అపార్థం కలిగే అవకాశం ఉంది. కానీ చివరలో ఆమె ద్వారా చెప్పించిన మాటలని చూస్తే కానీ రచయిత అసలు ఉద్దేశ్యం అర్థం కాదు. మనవరాళ్లను ఒకసారి చూసుకొని తిరిగెళ్ళిపోతామని అత్తమ్మ చెప్పి పంపించిన మాటలకు ఆ కోడలికి కళ్ళు చెమ్మగిల్లుతాయి. కథకుడి లాగాన అప్పటి దాకా పాఠకుడు కూడా ఆమెను అపార్థం చేసుకొనే వీలుంటుంది. ఆడపడుచుల కోసం మూడు జాకెట్టు ముక్కలు, బయట ఎక్కడా ఏమీ తినని అత్తమ్మ కోసం పెరుగన్నం ఒక బాక్స్‌లో పెట్టి తీసుకొచ్చి వచ్చే వరకు ఆ కోడలి మనసులో అత్తింటి వారి స్థానం ఏమిటో ఎవరికీ తెలియదు. అదంతా కూడా దొంగ ప్రేమ అని పొరపడే అవకాశం ఉంది. అది నిజం కాదని ఆమె మాటలు చదివాక అర్థమవుతుంది. "ఈ మతాంతర వివాహం వల్ల ఇన్ని సమస్యలుంటాయనుకుంటే నేను పెళ్ళి చేసుకునేదాన్నే కాదు. గృహిణిగా నా భర్త మానసిక ప్రశాంతత, నా పిల్లల భవిష్యత్తు, వారి పెళ్ళిళ్ళు నాకు ముఖ్యం. అత్తయ్య ఎలా అయితే ఆమె కూతుర్ల కొరకు బురఖా తీసెయ్యలేకపోయిందో, నేనూ నా కూతుర్ల గురించి ఆ కలమాలేవో చదివి, ఆ కాలిపోత్ ఏదో కట్టించుకొని, ఆ బురఖాలేవో తొడుక్కొని ఇస్లాంలోకి మారలేను. మా బతుకేదో మేం బతుకుతున్నాము. మమ్మల్ని ఇలా బతకనివ్వండి." ఇందులో ఎవరి ప్రేమ ఎక్కువ, ఎవరి ప్రేమ తక్కువ అని కాదు? ఎవరిది తప్పు? ఎవరిది ఒప్పు అని కూడా కాదు. పరిస్థితుల మధ్య, మతాల మధ్య నలిగిపోయిన ఇద్దరు తల్లుల కథ ఇది. మతాంతర వివాహాలు, మత మార్పిడుల మధ్య నలిగిపోయిన ఇద్దరు స్త్రీల కథ ఇది.
తెలుగు సాహిత్యంలో అత్త లాంటి అమ్మ గురించి, అమ్మ లాంటి కోడలు గురించి వచ్చిన మంచి కథల్లో ఇదొకటిగా నిలిచిపోతుంది. ముస్లిం స్త్రీ జీవిత నేపథ్యంగా ఇంత మంచి కథను అందించిన రహమతుల్లా కి అభినందనలు.



## కాలం మీద సంతకం




కవిత్వం

- డా॥ అద్దేపల్లి రామమోహనరావు

వెల : రూ.100/- పేజీలు : 114

ప్రతులకు : 9849150303

ప్రపంచీకరణ నేపథ్యంలో మనదేశంపై జరుగుతున్న సాంస్కృతిక దాడిని దాని వల్ల కలిగే విధ్వంసాన్నీ, పతనాన్ని, పరాధీనమై చితికిపోతున్న బతుకుల్నీ కళ్లకుకట్టినట్టు కవిత్వంలో దృశ్యమానం చేస్తున్నారు అద్దేపల్లి ఈ సంపుటిలో. ఆయన కవిత్వంలో ఆర్తి ఉంది. అన్నిటినీ మించి మనదేశం అస్తిత్వాన్ని కోల్పోతున్నదన్న ఆవేదన ఉంది.

- తాళ్లపల్లి మురళీధరగౌడు

## జిగర్





తెలంగాణ విశిష్ట కవిత్వ సంకలనం

- అనిశెట్టి రజిత

వెల : 250/- పేజీలు : 304

ప్రతులకు : 9849482462

తెలంగాణా పది జిల్లాల వైశిష్టతను ఈ సంకలనంలో కొంతమేరకే చేర్చగలిగినం. అయితే కొన్ని జిల్లాల నుండి ఎంత కోషిష్ జేసినా కవుల స్పందన లేకపోవడం వలన కవితలు రాబట్టలేక పోయినం. ఈ సంకలనం సంపూర్ణ తెలంగాణ విశిష్టతను ప్రతిబింబించలేదు. తెలంగాణా చారిత్రక, సాంస్కృతిక, ఉద్యమం విశిష్టతలు పాక్షికంగానే ప్రస్తావన కొచ్చినయి.

- అనిశెట్టి రజిత, కొమర్రాజు రామలక్ష్మి, తదితరులు

## శాలువా




కథలు

- పిడుగు పాపిరెడ్డి

వెల : రూ. 100/- పేజీలు : 133

ప్రతులకు : 9490227114

ఈ కథలను పరిశీలిస్తే కథకుడిగా పాపిరెడ్డి ఎంత పరిణతి సాధించాడో మనకర్థమౌతుంది. ఈ కథలన్నింటిలోను మనుషులను విభజించే కులమతాల కతీతమైన స్వచ్ఛమైన మానవతా దృక్పథం కనిపిస్తుంది. ఉన్నత సామాజిక వర్గాల్లోని స్వార్థపరత్వాన్ని, పురుషాధిక్య సమాజంలో స్త్రీలకు జరుగుతున్న అన్యాయాన్ని, అణచివేతను, విద్యార్థులకు ఆదర్శప్రాయంగా నిలవాల్సిన ఉపాధ్యాయుల నైచ్యాన్ని, అన్యాయానికి గురైనప్పుడు ఎంత బలహీనుడైనా తిరగబడే పరిస్థితిని పాపిరెడ్డి ఈ కథలలో చిత్రించాడు.

- అంపశయ్య నవీన్

## నన్ను సాయిబును చేసింది వాళ్ళే




- షేక్ కరీముల్లా

వెల : రూ.50/- పేజీలు : 100

ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలు

నిత్యం అసత్య ప్రచారాలతో ఫాసిజాన్ని వ్యాప్తి చేస్తూ ముస్లిం సమాజాన్ని నేరస్థసమాజమని, ఉగ్రవాద సమాజమని ఖరారు చేస్తూ బోనులో నిలబెట్టాలని చూస్తున్నాయి. ఈ విపరీత, విపత్కర పరిస్థితులలో ఈ సమాజంలో పుట్టిన కవిగా వివిధ సందర్భాలలో స్పందించి తెలుగు దినపత్రికలకు వ్యాసాలు రాశాను. ఆ వ్యాసాల సమాహారమే ఈ పుస్తకం.

- షేక్ కరీముల్లా

## పొలి




ముల్కీ - మూలవాసీ కవిత్వం

గాదె వెంకటేష్

వెల : రూ.40/- పేజీలు : 87

ప్రతులకు : 9849722127

ఉద్యమ క్షేత్రంలో నిలబడి కవిత్వం రాయడం తెలంగాణ బహుజన కులాలకు కొత్తకాదు. తెలంగాణసాయుధ రైతాంగ పోరాటం నుంచి మొదలు విప్లవ, దళితోద్యమాలే కాకుండా ప్రస్తుత తెలంగాణ విముక్తి ఉద్యమం వరకు ఈ ఒరవడి వారసత్వంగా వస్తున్నది. దీని కొనసాగింపుగానే గాదె వెంకటేషు ఒక వుద్యమకారునిగా రాసుకున్న స్పందనలే ఈ పుస్తకం నిండా పరుచుకున్నాయి.

- పసునూరి రవీందర్

## నేలతీపి ⊙ అజ్ఞాతం




కథా రూపకాలు

- డా॥.వి.ఆర్. రాసాని

వెల : రూ.60/- పేజీలు : 105

ప్రతులకు : 9848443610

నా కథలు కొన్ని నాటికలుగాను, నాటకాలుగాను నాటకీకరింపబడ్డాయి. అలాంటి వాటిగురించి ఒకసారి చర్చించుకుంటున్న సందర్భంలో సాహిత్య విమర్శకులు, ఎస్వీ యూనివర్సిటీలోని తెలుగు అధ్యయన శాఖలో ఆచార్యులు, మిత్రులు డా॥ మేడిపల్లి రవికుమార్‌గారు, అలాంటి నాటికలను వాటి మూలకథలతో బాటుగా ఒక పుస్తకం వేస్తే బాగుంటుందని సూచించారు. వారి సూచన కనుగుణంగానే ఈ పుస్తకం ముద్రించడం జరిగింది.

- రాసాని

# స్వీకారం

## మహాశూన్యం



అను భావకావ్యం

- డా॥ దీర్ఘాశి విజయభాస్కర్

వెల : రూ. 70/- పేజీలు : 104

ప్రతులకు : పాలపిట్ట బుక్స్

కావ్యం పేరు 'మహాశూన్యం' దీన్ని 'అనుభావ కావ్యం' అన్నారు డి. విజయభాస్కర్. అనుభావమనేది ఆలంకారిక పదం. లాక్షణికులు విభావానుభావ సాత్త్విక వ్యభిచారిభావ సముచ్చయాన్ని పేర్కొన్నారు. బౌద్ధమతం అవసానదశలో శూన్యవాదం ఆ మతంలోని ఒక శాఖగా రూపొందింది. డా ॥ విజయభాస్కర్ అటు బౌద్ధమతపరమైన శూన్యాన్ని, ఇటు అలంకార శాస్త్రపరమైన అనుభావాన్ని మేళవించి కవితాపరంగా ఒక వినూత్న సృష్టి చేశాడు.

- డా॥సి. నారాయణరెడ్డి

## చాణక్య నీతి మాలికలు



- యల్లాప్రగడ ప్రభాకరరావు

రూ. 120/- పేజీలు : 128

ప్రతులకు : 9908648474

హిందీ భాషలో శ్రీ జగదీశ్వరానంద సరస్వతి స్వామి అర్థతాత్పర్యయుక్తమైన వ్యాఖ్యానం వ్రాయగా, దానిని తెనాలి వాస్తవ్యులు, ఆర్య సమాజీయులు అయిన ఆరుమండ్ల వెంకయ్యార్యులు ఆంధ్రీకరించారు. దాని ఆధారంగానే ప్రస్తుత - యల్లా ప్రగడ ప్రభాకరరావు 'చాణక్య నీతిమాలికలు' విరచితమైంది. ప్రవేశికలోని 3 పద్యాలు, 17 భాగాలలోని 325 పద్యాలు, అనుబంధంలోని 14 పద్యాలు కలుపుకొని మొత్తం 342 పద్యాలు, వానికి సరళమైన వచనంలో భావం ఇందున్నాయి.

- డా. ఎస్వీ రామారావు

## అక్షర హారతి



నానీలు

చల్లా రాధాకృష్ణమూర్తి

వెల : రూ.60/- పేజీలు : 39

ప్రతులకు : 9848468782

ఆయన నానీలు వ్రాయడానికి నేపథ్యంలో ఆయన సుదీర్ఘమైన, గంభీరమైన జీవితానుభావాలు ఉన్నాయి. తెల్లారేసరికి పువ్వులు భళ్ళున పూసినట్లే ఉంటాయి. కానీ ఆ పూవుకు ప్రారంభం ఎప్పుడో మట్టిలోనే జీవకణ సంచలనంలోనే జరిగింది. అలా సహజ రమ్యంగా వెలువడిన నానీలే "అక్షర హారతి" పొద్దున్నే ఇస్తున్న హారతిలో కదిలే చిన్న చిన్న దీప కళికలే ఈ 'నానీలు'.

- ఎన్. గోపి

## ఆఖరి కుందేలు



ఉదయమిత్ర కథలు

- ఎం. రాఘవాచారి

వెల : రూ.100/- పేజీలు : 163

ప్రతులకు : 9985203376

రచన పాఠకులను చేయిపట్టుకొని రచయిత తిరిగిన తొవ్వలవెంబడి తిప్పుతుంది. రచయిత చూసిన లోకపు చీకటి మూలల దగ్గర నిలబెట్టి దుఃఖాన్ని, ద్వేషాన్ని వాళ్ళలోకి ప్రవహింపచేస్తుంది. ఒక వెర్రిగొంతుక విచ్చుకొని నినాదమై ఊరేగింపు ముందు నిలబడడానికి ప్రేరణ అవుతుంది. ఉదయమిత్ర కథలు ఇంతపనీ చేస్తాయి.

- కాత్యాయని విద్మహే

## యుద్ధకాండ



- డా॥ బండి సత్యనారాయణ

వెల : రూ. 70/- పేజీలు : 92

ప్రతులకు : 040-27678430

రంగుల, మాయల, సాంకేతికతల, ముసుగుల, నాజూకుల, అబద్ధాల, లౌక్యాల మయపు ఆధునిక వాతావరణంలో బండి సత్యనారాయణ సరళంగా, స్పష్టంగా, తేటగా, అంకితభావంతో మనిషి సగటు జీవితపు దృశ్యాల్ని మనకళ్ళ ముందుంచాడు, ఈ కవితల ద్వారా, వ్యాపార సంస్కృతి మనిషి తనాన్ని తినేస్తున్న సందర్భంలో ప్రత్యామ్నాయ సంస్కృతికి దాఖలా ఈ సంపుటి.

- దర్భశయనం శ్రీనివాసాచార్య

## అంతర్యానం



- కొండముది సాయికిరణ్ కుమార్

వెల : రూ.50/- పేజీలు : 70

ప్రతులకు : 040-27678430

కిరణ్ కవిత్వం చాలా చక్కటి చిక్కదనమున్న రూపం. ఎక్కడా పట్టుకోల్పోడు. వస్తు రూపాల మధ్య చక్కటి బ్యాలన్స్ కనపడుతుంది. అయితే, నేటి ఆంధ్రదేశంలో కుప్పలు తెప్పలుగా కుకవిత్వపు తుఫాను రేగుతున్న ఈ కాలంలో తొలకరి సువాసనల ఫ్రెషనెస్‌తో కిరణ్ కవిత్వం వినిపిస్తున్నాడు.

- ఇక్బాల్ చంద్

నివాళి

# తెలుగు ప్రమదల హృదయ నేత్రి

- రెంటాల జయదేవ

9490099136



'జగతి' పత్రిక సంపాదకులుగా ఎన్.ఆర్.చందూర్, రచయిత్రిగా మాలతీ చందూర్ మద్రాసు మహానగరంలో తెలుగు సాహిత్యం, సంస్కృతి, సామాజిక జీవితానికి దీపస్తంభాలుగా సుదీర్ఘకాలం వెలిగారు. చెన్నపట్నంలో తెలుగు సాహితీ సంస్థలకూ, సామాజిక ప్రముఖులకూ పెద్ద దిక్కుగా నిలిచారు. సంతానం లేని ఈ దంపతులు రచనలే తమ సంతానంగా, సాహితీ ప్రియులే బంధువులుగా గడిపారు. 1930లో కృష్ణాజిల్లా నూజివీడులో మాలతి జన్మించారు. తల్లిదండ్రులైన జ్ఞానాంబ, వెంకటేశ్వర్ల ఆరుగురు సంతానంలో ఆమె చివరి వ్యక్తి. బాల్యమంతా ఎక్కువభాగం నూజివీడులోనే గడిపిన ఆమె ఆ తరువాత మేనమామ అయిన ఎన్. ఆర్. చందూర్ ఇంట్లో ఏలూరులో ఉండి, చదువుకున్నారు. **అక్కడ వల్లూరి సెయింట్ థెరెస్సా పాఠశాలలో ఇంగ్లీషు మీడియమ్‌లో చదువుకున్నారు.** తరువాతి కాలంలో ఆయననే వివాహం చేసుకున్నారు. స్వతహాగా కథా రచయిత, 'కథావీధి' తదితర పత్రికలను నడిపిన చందూర్ సాహచర్యంలో మాలతి సాహితీ వ్యాసంగం వికసించి, విస్తరించింది. అక్కడే ఆనాటి సాహితీ దిగ్గజాలను ఎందరినో దగ్గర నుంచి ఆమె చూశారు. 1947లో మద్రాసుకు వచ్చిన ఈ జంట అప్పటి నుంచి ఆ నగరాన్నే తమ స్థిర నివాసంగా చేసుకున్నారు. మొదట జార్జిటౌన్ ప్రాంతంలో అద్దె ఇంట్లో గడిపిన ఈ దంపతులు 1960ల నుంచి చెన్నైలోని మైలాపూర్ ప్రాంతంలో కచ్చేరీ రోడ్డులో తెలుగు సాహితీ వాతావరణానికి చిరునామాగా నిలిచారు. వారి స్వగృహం బెజవాడ గోపాలరెడ్డి, వావిలాల గోపాలకృష్ణయ్య, శ్రీశ్రీ, ఆరుద్ర, సి. నారాయణ రెడ్డి తదితర రాజకీయ, సాహితీ ప్రముఖులెందరికో ఆటపట్టుగా వెలిగింది. మాలతీ చందూర్ అక్కయ్య, గతంలో ఉపాధ్యాయురాలైన శారదాంబ ఇప్పటి దాకా ఆ ఇంటికి పెద్ద దిక్కుగా అందరికీ తలలో నాలుకగా మెలిగారు.

**రచనలే లోకం !** : భర్త చందూర్‌ను ఎప్పుడూ "మామయ్యా" గానే సంబోధించే మాలతి పల్లెటూరిలో పెరిగిన తనను ఓ వ్యక్తిగా, ఇంత పెద్ద రచయిత్రిగా తీర్చిదిద్దడంలో ఆయన పాత్ర ఎంతో ఉందని బాహాటంగా చెబుతుండేవారు. ఆమె చదువుకున్నది ఎస్.ఎస్.ఎల్.సి. దాకానే అయినా, సమాజాన్నీ, జీవితాన్నీ ఆమె కాచివడపోశారు. 'చంపకం - చెదపురుగులు' (1955 సెప్టెంబర్‌లో ప్రథమ ముద్రణ) లాంటి ఆమె తొలినాళ్ళ రచనలు అప్పట్లో ఎంతో ప్రాచుర్యం పొందాయి. 'శతాబ్ది సూరీడు', 'కాంచన మృగం,' 'మనసులో మనసు', 'ఏమిటీ జీవితాలు', 'మధుర స్మృతులు', 'శిశిరవసంతం', 'ఆలోచించు' 'భూమిపుత్రి' తదితర పాతికపైగా నవలలు ఆమె రచించారు. పలు ఆంగ్ల రచనలను తెలుగులోకి అనువదించారు. భారత స్వాతంత్ర్య సమర కాలంలో జరిగిన ప్రసిద్ధ చీరాల - పేరాల ఉద్యమ నేపథ్యంతో 'వనిత' మాసపత్రికలో ఆమె రాసిన 'హృదయ నేత్రి' నవలకు 1990వ దశకం తొలి రోజుల్లో కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. తరువాత ఈ నవలను శ్రీమతి శాంతాదత్ గారు ఇదయ విళిగళ్ అన్న పేరుతో తమిళంలో అనువదించారు. తమిళ రచయిత డి. జయకాంతన్ నవలను కొన్ని సమయాలల్లో కొంత మంది మనుషులు ఎన్. పార్థ సారథి నవలను సమాజం కోరల్లో, శివశంకరి నవలను ఓ మనిషి కథ పేరిట తెలుగు పాఠకులకు ఆమె అందించారు. కలకత్తాలోని 'భారతీయ భాషా పరిషత్' వారి ప్రతిష్ఠాత్మక జాతీయ అవార్డు కూడా వరించింది. నాలుగేళ్ళ క్రితం 'స్వప్న' మాసపత్రికలో ధారావాహికగా వచ్చిన 'గౌతమీపుత్రి' ఆమె చివరి నవల. రచనా జీవితంతో తీరిక లేక, ఎప్పుడూ వంటింటికి దూరంగానే జీవితం గడిపిన మాలతీ చందూర్ రాసిన 'వంటలు - పిండి వంటలు' రచనల తెలుగునాట ఇవాళ్టికీ ఎంతో ప్రసిద్ధం పదే పదే పలు ముద్రణలు పొంది, వేల ప్రతులు అమ్ముడైంది. "మా పెద్దవాళ్ళ నుంచి నేర్చుకున్న వాటితో పాటు ఎప్పటికప్పుడు కొత్త వంటలను తెలుసుకొని రాశారు" అని ఆమె చెబుతూ ఉండేవారు. తెలుగుతో పాటు ఆంగ్లం, తమిళాల్లో చక్కగా మాట్లాడే మాలతి కొన్ని ప్రసిద్ధ తమిళ రచనలను 'సాహిత్య అకాడెమీ' తదితరుల కోసం తెలుగులోకి అనువదించారు. ఆమె రచనలు అనేకం తమిళ, కన్నడ భాషల్లోకి అనువాదమయ్యాయి.

**మధ్యతరగతి జీవితానికి మల్లెపందిరి :**

తెలుగులో చలం, విశ్వనాథ సత్యనారాయణ, ఇంగ్లీషులో సోమర్ సెట్ మామ్ తనకు ఇష్టమైన రచయితలని చెప్పే మాలతి చందూర్ వాస్తవానికి దగ్గరగా రచనలు చేసేవారు. వాటిలో మధ్యతరగతి జీవితాన్ని కళ్ళకు కట్టించే ప్రయత్నం చేశారు.

మధ్య తరగతి కుటుంబాలలోని మానవ సంబంధాలు, ఒడుదొడుకులు ఆమె రచనల్లో ప్రధాన పాత్ర వహిస్తాయి. చెప్పుకోవాల్సిన విషయం ఏమిటంటే, స్త్రీ పాత్రలకు వట్టి బేలలుగా ఆమె చిత్రించరు. ఆమె కథల్లోని స్త్రీ పాత్రలు ఆత్మ గౌరవంతో సమస్యలను ఎదుర్కొంటాయి.

మద్రాసు రేడియోలో ప్రసంగాలతో ఆమె తన సాహితీ వ్యాసంగం మొదలు పెట్టారు. 1950 ప్రాంతంలో 'ఆనందవాణి' వారపత్రికలో ప్రచురితమైన 'రవ్వల దుద్దులు' ఆమె రాసిన మొదటి కథ. 1953 ఆగస్టులో ప్రచురితమైన 'పాప' కథానిక, ఇంకా 'లజ్ కార్నర్, 'నీరజ' తదితర రచనలన్నీ ప్రముఖ సాహిత్య మాసపత్రిక 'భారతి'లో వచ్చాయి. దాదాపు 150కి పైగా కథలు ఆమె రాశారు. దాదాపు 66 ఏళ్ళుగా మద్రాసు మహానగరంలో ఉన్న ఆమె సహజంగానే తన కథలలో ఎక్కువగా చెన్నపట్టణాన్ని నేపథ్యంగా తీసుకొన్నారు. ఆ నవలా పరిచయాలు 2002 ప్రాంతంలో 'పాత కెరటాలు' శీర్షకనే పుస్తక రూపంలోకి వచ్చాయి. కాగా, ఆ తరువాత 2008, 2010 నాటికి 'నవలా మంజరి' శీర్షికన ఆరు భాగాలుగా కొత్త పేరుతో తిరిగి ప్రచురితమయ్యాయి.

**పాఠకులకు సుదీర్ఘ 'కాలమ్' ఇష్టురాలు :** ఇప్పటికి దాదాపు 6 దశాబ్దాల కాలంగా పాఠకులతో ప్రశ్నలు, జవాబులు శీర్షికను విజయవంతంగా నడుపుతూ వస్తూ, తెలుగు కాలమిస్టుల చరిత్రలో మాలతీ చందూర్ ఓ అరుదైన ఘనత సాధించారు. ప్రముఖ సంపాదకుడు నార్ల వెంకటేశ్వరరావు 1950లలో 'ఆంధ్రప్రభ' వారపత్రికలో 'ప్రమదావనం' పేరిట స్త్రీల కోసం ప్రత్యేకంగా మాలతీ చందూర్‌తో కాలమ్ ప్రారంభించారు. వంటలు, కుట్లు - అల్లికల సామాన్య విషయాల మొదలు సామాజిక, రాజకీయ, కుటుంబ వ్యవహారాల దాకా మహిళలకు సూచనలు, సలహాలిస్తూ మాలతీ చందూర్ నడిపిన ఆ శీర్షిక కొన్ని తరాల వారికి ప్రీతిపాత్రమైంది. ఎంతోమందిని ప్రభావితం చేసింది. ఒక రకంగా తెలుగు నాట 'ఎగోనీ ఆంట్' తరహా కాలమ్స్‌కు ఆమె 'ప్రమదావనం' ఒరవడి పెట్టింది. ఆ పత్రిక చేతులు మారే ముందు నూతన సహస్రాబ్ది తొలిరోజుల దాకా ఆ కాలమ్ అందులో కొనసాగింది. ఆ తరువాత నుంచి ఇప్పటి దాకా అదే కాలమ్ 'నన్ను అడగండి' అనే కొత్త పేరు, రూపంతో 'స్వాతి' సపరివారపత్రికలో వారం వారం అలరిస్తూ వస్తోంది. పాఠకులు ఏ చిన్న ప్రశ్న అడిగినా, సమగ్రమైన సమాచారంతో వ్యాఖ్యానభరితంగా ఆమె ఇచ్చే జవాబులు ఎంతో పాపులర్. మాలతీ చందూర్ మాటలతో జీవితాలను సరిదిద్దుకున్నామనీ, ఇవాళ్టికీ తమ మనుమరాళ్ళ సమస్యలకూ ఆమెనే సలహాలు అడుగుతున్నామనీ చెప్పేవారు ఎంతోమంది! అలాగే, 'స్వాతి' మాసపత్రిక ప్రారంభ రోజుల నుంచి ఇప్పటి దాకా మూడు దశాబ్దాల పైచిలుకుగా 'పాత కెరటాలు' పేరిట మరో పాపులర్ శీర్షికను ఆమె నిర్వహిస్తున్నారు. అందులో ప్రతి నెలా ప్రపంచ ప్రసిద్ధ ఆంగ్ల నవలలను పరిచయం చేస్తూ వస్తున్నారు. ఆ నవలా పరిచయాల కోసం ఎప్పటికప్పుడు కొత్త పుస్తకాలు తెప్పించుకొని, వాటిని క్షుణ్ణంగా చదివి, ఆ పుస్తకసారాన్ని కొద్ది పేజీల్లో సాకల్యంగా పరిచయం చేయడానికి ఆమె తీసుకొనే శ్రమ ప్రత్యక్షంగా చూసినవారికి తెలుసు.

**చివరి వరకు అదే కృషి :** 'పుస్తక పఠనం, సజ్జన సాంగత్యం'తో చందూర్ దంపతులు వయస్సు మీద పడినా దాన్ని లెక్క చేయకుండా, చివరి వరకు సాహిత్య సామాజిక కృషిలో గడిపారు. దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ స్థాపించిన 'ఆంధ్ర మహిళా సభ' నిర్వహణలో అభివృద్ధిలో మొదటి నుంచి ఇప్పటి వరకు భాగస్వామ్యం వహించారు. ఆప్యాయమైన పలకరింత, తమను కలుసుకోవడానికి ఎక్కడెక్కడి నుంచో వచ్చే సాహితీ ప్రియులకు వారిచ్చే ఆతిథ్యం చాలామందికి అనుభవైకవేద్యం. 1970లలో కేంద్ర సెన్సార్ బోర్డు సభ్యురాలిగా పనిచేసిన ఆమెకు మద్రాసులో తెలుగు చిత్ర పరిశ్రమ వెలిగిన రోజుల్లోని ప్రముఖులందరూ సుపరిచితులే. ప్రముఖ తమిళ రచయిత్రి శివశంకరి తదితరులు ఆమెను ఎంతో గౌరవించేవారు. తెలుగు నేలకు దూరంగా ఉన్నప్పటికీ ఇక్కడి వారితో సమానంగా, కొన్ని సందర్భాల్లో ఎక్కువగా పేరు తెచ్చుకున్న రచయిత్రిగా మాలతీ చందూర్ కృషిని గుర్తించి, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆమెకు గౌరవ డాక్టరేట్‌ను ప్రదానం చేసింది. ఆమె రచనలపై పలు విశ్వవిద్యాలయాల్లో పరిశోధనలు జరగడం విశేషం. చందూర్ మరణానంతరం మాలతి, కుటుంబ సభ్యులు ఆయన పేరు మీద ఎన్.ఆర్. చందూర్ - జగతి అవార్డు'ల పేరిట ఓ స్మారక పురస్కారాన్ని నెలకొల్పారు. ప్రతి ఏటా జనవరి 11న చందూర్ వర్ధంతి నాడు నిరాటంకంగా ఈ కార్యక్రమం కొనసాగేందుకు తాను మదుపు చేసిన సొమ్ము అంతా ఓ ట్రస్టు పేరిట మాలతి పెట్టారు. ప్రముఖ జర్నలిస్టు పాలగుమ్మి సాయినాథ్ (2012), 'ఆంధ్రజ్యోతి' ఢిల్లీ విలేకరి ఏ.కృష్ణారావు (2013)కు ఇప్పటి దాకా ఈ పురస్కారాలు ఇచ్చారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం కోసం 1950ల ప్రథమార్ధంలో అమరజీవి పొట్టి శ్రీరాములు ఆమరణ నిరాహారదీక్ష జరిపి, అసువులు బాపిన భావన సంరక్షణ నిర్వహణ బాధ్యతల్లో కూడా మాలతీ చందూర్ దంపతులు అవిరళ కృషి చేశారు. అమరజీవి పొట్టి శ్రీరాములు మెమోరియల్ సొసైటీ' సంస్థాపక సభ్యురాలైన ఆమె ప్రస్తుతం ఆ సంస్థకు అధ్యక్షురాలిగా వ్యవహరిస్తున్నారు. చెన్నైలోని క్వీన్ మేరీస్ కళాశాల లాంటి ప్రసిద్ధ విద్యాసంస్థల్లో తెలుగు బోధనాంశాన్ని ఎత్తి వేసేందుకు తమిళనాడు ప్రభుత్వం ఆ మధ్య ప్రయత్నించినప్పుడు దాన్ని తీవ్రంగా వ్యతిరేకించి, ఉద్యమబాట పట్టారామె. సాహితీ ప్రియులైన యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, కేంద్ర మంత్రి పురంధేశ్వరి తదితరులతో మాట్లాడి, 'తెలుగు ఎత్తివేత' నిర్ణయాన్ని వెనక్కు తీసుకొనేలా చేశారు. రాజా-లక్ష్మి ఫౌండేషన్ అవార్డుతో సహా ఎన్నో పురస్కారాలు, సన్మానాలతో పేరుప్రతిష్ఠలు వచ్చినా, చివరి వరకు ఎంతో నిరాడంబరంగా సాదాసీదా మహిళ లాగా జీవించడం ఆమెలోని విశిష్టత.





జులై 14న మహబూబ్‌నగర్ జిల్లా అచ్చంపేటలో గట్టుమనోహర్‌రెడ్డి రచించిన మనోహర గేయాలు గేయ సంపుటిని ఆవిష్కరిస్తున్న ప్రసిద్ధ సాహిత్య పరిశోధకులు కపిలవాయిలింగమూర్తి.

## "మునిమాణిక్యం కథలు - మానవ సంబంధాలు"

సాహితీ స్రవంతి, కాకినాడ ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న "ప్రతినెల - సాహిత్య హేల" ఆగష్టు నెల కార్యక్రమం గాంధీ భవన్‌లో ఆగష్టు 4న జరిగింది. ఈ కార్యక్రమానికి ప్రముఖ కవి డా. అద్దేపల్లి రామమోహనరావు అధ్యక్షత వహించి, ప్రతినెలా సాహిత్య కార్యక్రమాల నిర్వహణ ద్వారా అనుభవజ్ఞుల నుండి యువ రచయితలకు మార్గదర్శనం, ప్రేమరణ లభించగలవని అన్నారు. ప్రసిద్ధ కథా రచయిత మునిమాణిక్యం నరసింహారావు కథల్లో "భావ ప్రసార నైపుణ్యాలు - మానవీయ విలువలు" అనే అంశంపై అవధానుల మణిబాబు సోదాహరణ ప్రసంగం చేస్తూ, కుటుంబ జీవనంలో లభించే రసానుభూతులన్నిటిని హాస్యంతో రంగరించి అంతర్లీనంగా సందేశాన్నందించే అద్భుత కథలుగా అభివర్ణించారు. అనంతరం 'వానాకాలం' అంశంపై అద్దేపల్లి నిర్వహించిన కవితా గోష్ఠిలో డా. శిరీష, గరికపాటి సూర్యనారాయణ మూర్తి, అవధాని పోచనపెద్ది, అద్దేపల్లి జ్యోతి, ఇందిర, ఐ.ఎస్.మూర్తి, కే.వి.ఆర్. శాస్త్రి తదితరులు పాల్గొని తమ కవితలను వినిపించారు. ఈ సభకు గ.నా.రా., ఇబ్రహీంలు వ్యాఖ్యాతలుగా వ్యవహరించారు. సెప్టెంబర్ 1న నిర్వహింపబడే తరువాత కార్యక్రమానికి కవితా వస్తువుగా 'గోదావరి'ని నిర్ణయించారు.




ప్రసంగిస్తున్న మణిబాబు, చిత్రంలో అద్దేపల్లి, గనారా



గుంటూరు జిల్లా పొన్నూరులో డా. కత్తిపద్మారావును ఆయన షష్టిపూర్తి సందర్భంగా సత్కరిస్తున్న ప్రముఖ నాస్తిక నాయకులు లవణం, ప్రముఖ రచయిత బి.యస్.రాములు తదితరులు

## మల్లెతీగ పురస్కారం కోసం కవితలు ఆహ్వానం

'మల్లెతీగ పురస్కారం' పేరుతో కవుల్ని సత్కరించాలని మల్లెతీగ సాహితీ సమాచార వేదిక సంకల్పించింది. ఇందుకు కవుల నుండి కవితలు ఆహ్వానిస్తోంది. ఒక్కో కవి మూడు కవితల వరకు పంపవచ్చు. అయితే ఒక్కో కవిత మూడు కాపీలు పంపాలి. ఒక కాపీ వెనుక మాత్రమే పేరు, చిరునామా, సెల్ నెంబరు రాయాలి. మిగతా రెండు కాపీలపై మీ పేరు గాని చిరునామాగానీ రాయకూడదు. కవితతోపాటు మీ ఫోటో తప్పనిసరిగా పంపాలి. కవితలు పంపే కవరుపై 'మల్లెతీగ పురస్కారం కోసం' అని ప్రత్యేకంగా రాయాలి. పురస్కార గ్రహీతలు నవంబరులో విజయవడలో జరిగే పురస్కారం ప్రదానోత్సవ సభకు తప్పక హాజరై తమ పురస్కారాన్ని స్వయంగా అందుకోవాలి అని ప్రకటనలో తెలిపారు. ప్రధాన పురస్కారం రూ. 5000/ల నగదుతో గౌరవ సత్కారం. మరో ఐదుగురికి ఆత్మీయ ఉపరస్కారం రూ. 1000/ల నగదుతో సత్కారం ఉంటుంది. ఆసక్తి గల కవుల తమ కవితల్ని 'కలిమిశ్రీ, మల్లెతీగ సాహితీ సమాచార వేదిక, డోర్ నెం. 41-20/3-24, మన్నవవారి వీధి, కృష్ణలంక, విజయవాడ-520013' చిరునామాకు సెప్టెంబరు 30వ తేదీలోగా పంపాలి. మరిన్ని వివరాల కోసం 9246415150 మొబైల్‌లో సంప్రదించవచ్చు.

## జమున స్మారక నానీల అవార్డు

సోమిరెడ్డి జమున పేరు మీద నెల్లూరు రచయిత్రి డా॥ పెళ్ళకూరు జయప్రద ప్రతి సంవత్సరం ఇస్తున్న సోమిరెడ్డి జమున స్మారక రాష్ట్ర స్థాయి నానీల అవార్డు 2013లో డా॥ వై. రామకృష్ణారావు (హైదరాబాద్)కు 'మనసు చిత్రాలు' నానీల సంపుటికి లభించింది. ప్రతిష్ఠాత్మకమైన ఈ పురస్కారానికి కరీంనగర్‌కు చెందిన దాస్యం సేనాధిపతి మాడిశెట్టి గోపాల్, అదువాల సుజాత న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించారు. 2013 సెప్టెంబర్ మూడవ వారంలో జరిగే సభలో వై. రామకృష్ణరావుకు ప్రశంసా పత్రం, మెమొంటోతో పాటు 5 వేల నగదుతో అవార్డు ప్రదానం జరుగుతుందని ఒక ప్రకటనలో యస్.వి.యన్. రెడ్డి తెలిపారు.



వంశీ ఆర్ట్ థియేటర్స్ మరియు వంగురి ఫౌండేషన్, శ్రీ త్యాగరాయ గానసభల సంయుక్త ఆధ్వర్యంలో తెలుగు బుక్ అఫ్ రికార్డ్సులో పేరు నమోదు చేసుకునేందుకు ఆగష్టు 25న ఉదయం 8 గం॥ నుండి రాత్రి 8 గం॥ వరకు కళా సుబ్బారావు కళా వేదికపై జరిగిన 'తెలుగు భాషా సాహిత్యాలపై 12 గం॥ల పాటు డా. ద్వా.నా శాస్త్రి గారి నిర్విరామ ప్రసంగధార ఎంతో విజయవంతంగా పూర్తి అయింది. ఈ సందర్భంగా ద్వా.నా శాస్త్రిని సత్కరిస్తున్న ప్రభృతులు సన్మాన కర్తగా జస్టిస్ సముద్రాల గోవింద రాజులు, నేటినిజం సంపాదకులు బైసదేవదాసు కళా వెంకట దీక్షితులు, గోల్డెన్ స్టార్ అధ్యక్షులు బింగి నరేందర్ గౌడ్ జాతీయ అధ్యక్షులు, తెలుగు బుక్ అఫ్ రికార్డ్స్ డా. చింతపట్ల వెంకటాచారి, డా. తెన్నేటి సుధాదేవి తదితరులు ఉన్నారు.

## తెలుగు అకాడమీ జాషువా పురస్కారాలు

జాషువా 118వ జయంతిని పురస్కరించుకుని తెలుగు అకాడమీ జాషువా పరిశోధనా కేంద్రం తరపున పురస్కారాలకు నామినేషన్లను ఆహ్వానిస్తున్నట్లు సంచాలకులు ఆచార్య కె. యాదగిరి ఒక ప్రకటనలో తెలిపారు. 60 ఏళ్ళు పైబడిన వారికి, తెలుగు భాషా సాహిత్య రంగాలలో విశిష్ట కృషిచేసిన ప్రసిద్ధ సాహితీవేత్తలకు జాషువా జీవిత సాఫల్య పురస్కారం, ఏభై ఏళ్ళు పైబడిన వారికి , దళిత సాహిత్యంపైన కృషిచేసిన సుప్రసిద్ధ సాహితీవేత్తలకు జాషువా విశిష్ట పురస్కారం, భాషా, సాహిత్య రంగాలలో విశిష్ట కృషిచేసిన మహిళా సాహితీవేత్తలకు జాషువా విశిష్ట మహిళా పురాస్కారం అందజేయనున్నట్లు తెలిపారు. సెప్టెంబర్ 28న జరిగే జాషువా జయంతి ఉత్సవాలలో ఈ పురస్కారాలు అందజేస్తారు. వ్యక్తిగత నామినేషన్లు స్వీకరించబడవని, పురస్కార గ్రహీతలకు రెండు లక్షల నగదు, మెమొంటో అందజేయబడుతుందని తెలిపారు. నామినేషన్లను సెప్టెంబరు 7 వ తేదీలోపు చేరాలి. ఇతర వివరాలకు 040-23220244, 9849225677 ద్వారా సంప్రదించవలసిందిగా కోరారు. కో-ఆర్డినేటర్, పద్మభూషణ్ డా. గుర్రం జాషువా పరిశోధన కేంద్రం, కేరాఫ్/సంచాలకులు, తెలుగు అకాడమీ, 3-5-895, హిమయత్‌నగర్, హైదరాబాదు-500 029 చిరునామాకు నామినేషన్లను పంపించవచ్చును.



విశాఖపట్నం పౌర గ్రంథాలయంలో ఆగష్టు 18న ప్రముఖ కవి "తిలక్" కవిత్వం, కథనంపై అరసం (విశాఖ శాఖ) నిర్వహించిన సదసుసలో ఎడమ నుండి డా॥ దేవరగొండ సహ దేవరావు పౌరహక్కుల సభ్యులు శ్రీరామమూర్తి, కవి పి. అనంతరావు, కార్యదర్శి అడపా రామకృష్ణ పాల్గొన్నారు.



ఆగష్టు 11న కామన్‌డయాస్ సంస్థ ఆధ్వర్యంలో రచయిత కనకాచారి స్వీయ కవితాసంపుటి వంతెనని ఆవిష్కరిస్తున్న ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధిపతి డా॥ మసనచెన్నప్ప. చిత్రంలో సి.వి.చారి, తంగిరాల చక్రవర్తి, జ్వలిత, ప్రభాకాచారి, పాండురంగాచారి తదితరులు వున్నారు.

## మినీ కథా వసంతం

సహజ సాహితి చీరాల 8 వత్సరాలు పూర్తి చేసుకున్న సందర్భంగా జాతీయస్థాయిలో 100 మంది లబ్ధ ప్రతిష్టులై కథా రచయితల రచనలతో మిని కథా వసంతం సంకలనం తీసుకురావాలని నిర్ణయించినట్లు ఆ సంస్థ అధ్యక్షులు వడలి రాధాకృష్ణ ఒక ప్రకటనలో తెలిపారు. కథ ఇంతకముందు ఎక్కడ ప్రచురించబడనిదై వుండాలి. ఫోటో, హామీ పత్రము, రచయిత సంక్షిప్త పరిచయముతో పాటు రచనలు పంపడానికి ఆఖరు తేది. 31.10.2013 రచనలు పంపవలసిన **చిరునామా :** వడలి రాధాకృష్ణ, అధ్యక్షులు సహజ సాహితి, ప్రొసెసింగ్ మేనేజర్, ఐ.టి.సి. లిమిటెడ్, ఎ.బి.డి, ఐ.ఎల్.టి.డి చీరాల-523157, ప్రకాశం జిల్లా. ఇతర వివరాలకు 9985336444 ద్వారా సంప్రదించవచ్చును.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor: T. Ravi**

# గుర్రం జాషువా

## 28.09.1895 - 24.07.1971



అట్టడుగు కులంలో పుట్టి అనేక అవమానాలు ఎదుర్కొని నిలబడ్డారు. 'గబ్బిలం' వంటి ఖండ కావ్యాలతో దళితుల హృదయవేదనను అద్భుతంగా ఆవిష్కరించారు. 'పిరదౌసి', 'కాందిశీకుడు', 'ముంతాజ్‌మహల్' వగైరా ఖండకావ్యాలు రాసి కవికోకిల, నవయుగ కవి చక్రవర్తి అని బిరుదులు పొందారు.




50



## మనసు ఫౌండేషన్

### పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A153 |
| పుస్తకం పేరు | ఛాన్దసం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yas |
| వెనుక అట్ట | Yas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KDaveed |
| పేజీలు విడదీసినది | KDaveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |